# ॥ ప్రజ్ఞా పురాణం ॥

## ప్రథమ ఖండం

# సత్ సాహస - సంఘర్షణ, యుగాంతర చేతన-లీలా సందోహ ప్రకరణములు


*హిందీ మూలం:*

వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ట

**పండిత శ్రీరామ శర్మ ఆచార్య**

గాయత్రీతీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్ - 249411 (ఉ.ప్ర)

*తెలుగు అనువాదం:*

**నేమాని గౌరీసావిత్రి**

సాహిత్య రత్న(హిందీ)



గాయత్రీ తీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్.

గాయత్రీ చేతనా కేంద్రము, హైదరాబాదు.

# యుగాంతరీయ చేతన - లీలా సందోహ,
# సత్ సాహస - సంఘర్షణ ప్రకరణములు

ద్వితీయ ముద్రణ:
**సర్వజిత్ నామ సంవత్సర మార్గశిరం**

**ప్రతులు : 5000**

**మూల్యము: రూ. 20 /- లు**

*డి.టి.పి., ముఖచిత్ర రూపకల్పన:*

**దేవీప్రసాద్**

**ప్రజ్ఞా గ్రాఫిక్స్**, గుంటూరు.

*ముద్రణ:*

**శ్రీదత్తసాయిగ్రాఫిక్స్**, హైదరాబాదు.

GAYATRI CHETANA KENDRA & MEDITATION CENTRE

*ప్రతులకు:*

గాయత్రీ చేతనా కేంద్రము మరియు ధ్యాన మందిరం
అశ్వినిహౌస్ వద్ద, మూసాపేట, హైదరాబాదు -500 018

## ॥ తొలిపలుకు ॥

మానవుని ఎట్టెదుట సాక్షాత్కరించే అనేక సమస్యలకు పరిష్కారాన్ని తెలిపే కథలు, ప్రసంగాలు అనేకం భారతీయ ఇతిహాసాలలోను, పురాణాలలోను వ్రాయబడి ఉన్నాయి. కాలం యొక్క అవసరాన్ని, ఈనాటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, ఈ యుగ సమస్యలను పరిష్కరించగల కొన్ని ప్రసంగాలను, కథలను ఈ "ప్రజ్ఞాపురాణం"లో పొందుపరిచాము. యుగవేదాంతం నిండి ఉన్న ఈ పురాణంలోని శ్లోకాలు, సందర్భాలు నవీనమైనవిగా ఉన్నా, దీనిలో పొందు పరచిన సత్యాలు! సనాతమైనవి, శాశ్వతమైనవి. దీనిలో సమగ్ర మానవ ధర్మానికి వన్నె తెచ్చే అనేక ఇతిహాస పురాణ కథలే కాక ఇతర మతాలకు చెందిన వారికోసం ఇతర ధర్మావలంబులైన ప్రజల కోసం కూడా అనేక కథలు సేకరించటం జరిగింది.

కాలం ఒకేలా ఉండదు. మార్పు దాని సహజ లక్షణం, మారే కాలంతో పరిస్థితులు, సమస్యలు, సంప్రదాయాలు, విలువలు కూడా మారుతూనే ఉంటాయి. ఈ శాశ్వత సృష్టిని, మారేకాలాన్ని దృష్టిలో ఉంచుకొని కాలానుగుణంగా మార్గదర్శనాన్ని ఇవ్వగల సాహిత్యాన్ని సమాజానికి అందివ్వ వలసిన బాధ్యత ఎంతైనా ఉంది. అన్నిరకాల మానసిక స్థితి కలవారినీ, వారి వారి పరిస్థితులను దృష్టి యందుంచుకొని, వారికి సౌకర్యాన్ని ఇవ్వాలనే తలంపుతో ఈ గ్రంథ రచన సాగింది. దీనివలన నా ఏకాంత సాధనకు ఇబ్బంది కలిగినా ఒకేసారిగా ఈ పురాణం 4 ఖండాలుగా సృష్టించబడ్డాయి. ఈ యుగ పురాణాన్ని సనాతనమైన 18 పురాణాల వలెనే 18 ఖండాలుగ లిఖించాలనే కోరిక ఉన్నది. భవిష్యత్తు మన చేతుల్లో లేకపోయినా చేతిలోని కలం ఆగనంటూ పరిగెడుతూనే ఉంటుంది.

ప్రాచీన కాలంలో 18 పురాణాలు లిఖించబడ్డాయి. అవి చాలవంటూ మరో 18 ఉపపురాణాలు లిఖించ బడ్డాయి. వీటిలో మొత్తం 100,00,000 శ్లోకాలున్నాయి. అంతేకాక నాలుగు వేదాలలోను మొత్తం 20 వేల మంత్రాలున్నాయి. ఇంకా చాలా కథా సాహిత్యం లిఖించబడింది. ఈ కథాసాహిత్యం అంతా త్రాసులోని ఒక సిబ్బెలోను, మిగిలిన మొత్తం సాహిత్యం రెండవ సిబ్బెలోను పెడితే కథాసాహిత్యం పెట్టిన సిబ్బెవైపే మొగ్గు చూపుతుంది అంటే అతిశయోక్తికాదు. వేదాంతపరమైన ప్రవచనాలు, ప్రతిపాదనలు వికసించిన మనోభూమి కలవారికి మాత్రమే అవగతమవుతాయి. కానీ కథలు శిక్షితులను, అశిక్షితులను, బాలలను వృద్ధులను, స్త్రీలను, పురుషులను అందరినీ అలరిస్తాయి. కథాసాహిత్యం కేవలం లోకరంజనమే కాదు లోకమంగళం కూడా.

పర్వదినాలలో అనేక అనుష్ఠానాలు ఆచరిస్తూ ఉంటాం. అలాంటప్పుడు విధిగా ప్రజ్ఞాపురాణ ప్రవచనాలు వినిపించాలి. మొదటిరోజు దేవపూజ, వ్రతధారణ, మంగళాచరణ కావించి, ఉదయం ఒక గంట సాయంత్రం ఒక గంట. ఒక్కొక్క ఖండం ఒక్కొక్కరోజు సంక్షిప్త పరిచయం ద్వారా వినిపించవచ్చు. ఆఖరు రోజు పాయసం, ఖిచిడీ వంటి పదార్థాలతో సామూహికంగా ప్రీతి భోజనాలు చేసి, ఆ తరువాత సంస్థయొక్క బ్యానర్స్‌తో శోభాయాత్ర (ఊరేగింపు) జరిపించాలి. ఈ ప్రీతి భోజనం, శోభాయాత్రల వల్ల వ్యక్తుల మధ్య కులమతాలు మొదలైన అనేక అడ్డుగోడలు తొలగి ప్రవచనాలు నూటికి నూరుపాళ్ళు ఫలించే అవకాశాలు ఉన్నాయి.

ఈ గ్రంథాలను వ్యక్తిగత స్వాధ్యాయానికి ఉపయోగిస్తే వ్యక్తి శక్తిగా మారగలదు. సామూహిక సత్సంగాలలో ఉపయోగిస్తే జనజాగృతి జరిగి తీరుతుంది. రాత్రి నిద్రించే ముందు కుటుంబ సభ్యులు అంతా కలిసి చదువుకొంటే నిద్రలో సూక్ష్మ శరీరాలకు సందేశాలు అందుతాయి. చిన్నపిల్లలకుఈ పురాణం అత్యంత ప్రీతికరమైనది. అలాగే వృద్ధులకు ఈ పురాణం ధర్మపరంపరను అవగతం చేయటానికి అత్యంత సహాయకారిగా తోడ్పడుతుంది. ఈ పురాణం రోజూ దేవాలయాల్లో వినిపిస్తే పలాయన వాదానికి అలవాటుపడ్డ ఆలయాలు జాగృతి కేంద్రాలుగా అనతికాలంలోనే మారిపోతాయి.

లోకశిక్షణకు గోష్ఠులు, సభలు, సమావేశాలు ఎంతో అవసరం, కానీ వేదాంతపరమైన ఉపన్యాసాలు అక్కడ వినిపించటం వల్ల సామాన్య జనులకు అర్థంకాక విసిగి పారిపోయి పలాయనవాదానికి అలవాటు పడతారు. కానీ ఈ పురాణంలోని కథలు, ప్రసంగాలు నెలల తరబడి వినిపించినా ఇంకా వినాలనిపించేటంత ఆసక్తికరంగా ఉంటాయి. హృదయానికి హత్తుకొంటాయి. యుగశిల్పులకు, ప్రజ్ఞాపరిజనులకు లోక శిక్షణార్థం ఒక అమూల్యమైన "నిధి" ప్రజ్ఞాపురాణ రూపంలో అందజేయబడింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ప్రతి ప్రజ్ఞాపీఠంలోను, ప్రశిక్షణా కేంద్రంలోను, ప్రతి సభలోను, ప్రతి సమావేశంలోను ప్రజలకు "యుగసందేశం" గా ప్రజ్ఞాపురాణం వినిపించండి.

ప్రధమఖండంలో యుగసమస్యల కారణంగా ఉద్భవించిన అవిశ్వాసం యొక్క వివరణ ఈయబడింది. దాని నుండి బయటపడి ఎలా ప్రజ్ఞాయుగాన్ని క్రియారూపంలో అవతార శక్తిద్వారా ప్రవేశ పెట్టగలమో సందేశ రూపంలో అందించబడింది. భ్రష్ట చింతనలు, దుష్ట ఆచరణల నుండి బయటపడి ఆధ్యాత్మ విలువలను వ్యవహారిక రూపంలో ఏ విధంగా ఉపయోగించుకోవచ్చో తెలియజేసే విస్తృత వివరణ దీనిలో ఇవ్వబడింది. చివరకు "మహాప్రజ్ఞ" యొక్క ఆలంబన ద్వారా లభింపగల సత్యయుగ వాతావరణ పరిస్థితుల వెలుగులు వెదజల్లబడ్డాయి.

ఈ నా రచనలో ఎక్కడైన అనుచితంగానీ, అసందర్భం గానీ, గోచరించినా, అక్షర తప్పులుగానీ, ముద్రణ లోపాలుగానీ ఉన్నా విజ్ఞులు నాకు తెలియజేయండి. ఆనందంగా స్వీకరించి తరువాత ప్రచురణలో అలా జరగకుండా చూసుకొంటాను.

- శ్రీరామశర్మ ఆచార్య

# ॥ ప్రజ్ఞా పురాణం ॥

## సత్ సాహస - సంఘర్షణ ప్రకరణం

శ్లో॥ ఆరణ్యకస్య సత్రస్య పంచమే దివసే శుభే ।
జిజ్ఞాసుః సహి దూర్వాసా మహర్షిః ప్రముఖ్యోభవత్ ॥
స్థితః సో అగ్రిమ పంక్తే చ జిజ్ఞాసాం స్వాంచ వ్యాహరన్ ।
ఓ జో గంభీరయా వాచా పిప్పలాద మథా బ్రవీత్ ॥

ఆరణ్యక శిబిరం యొక్క ఐదవరోజు ప్రముఖ జిజ్ఞాశువు దూర్వాసమహర్షి ప్రథమ పంక్తిలో ఆశీనుడై గురు గంభీర స్వరంతో పిప్పలాద మహర్షి వద్ద ఈ క్రింది విధంగా తన జిజ్ఞాసను వ్యక్తం చేశారు.

శ్లో॥ బ్రహ్మ విద్యా ప్రవృత్తేః సంవర్ధనస్య ప్రసంగకే ।
దేవ! యద్ భావనా ప్రోక్తం కృతార్థ వయమత్రతు ॥
తథాప్యేకం తు పాశ్యామీ హ్యసమంజస మత్రయాత్ ।
సంసారే వ్యాప్త దుర్భావైః సంఘర్షః కిం విధో భవేత్ ॥
ఆసురాక్రమణై రాత్మరక్షాయైకే హ్యుపాయకాః ।
ఆశ్రితవ్యా ఇదం చాపి కృపయాద్యనిగద్యతావ్ ॥
స్రష్టుః పవిత్ర సృష్టాతు కస్మాద్దేత్తో రవస్థితమ్ ।
అధర్మ్యాస్తిత్వమే తద్ యజ్ఞ గత్సర్వం ష్ట్యానోత్యలమ్ ॥

"దేవా! బ్రహ్మ విద్యయొక్క సత్ ప్రవృత్తుల సంవర్ధనం గూర్చిన అంశం ద్వారా మీరిచ్చిన సందేశం మమ్ములను కృతార్థులను చేసింది. ఈశ్వరానుగ్రహం, ఆత్మ కల్యాణం, విశ్వకల్యాణం వంటి దైవానుదానాలను పొందినట్లుగా అనుభూతి చెంది మేము ధన్యులమైనాము. మానవుడు పొందవలసిన సద్జ్ఞానాన్ని పొందటం వలన మాకు మార్గదర్శనం లభించేదే గాని, ఇంకా కొన్ని సందేహాలు మమ్ములను బాధిస్తున్నాయి.

పృథ్వి పవిత్రమైనది. జీవులన్నీ అందరకూ శుభాన్ని కల్గించటకే దైవం ద్వారా పంపబడ్డాయి. మరి ఈ భగవత్సృష్టిలో నాల్గు దిక్కులా మంచితోపాటు చెడు కూడా ఎందుకు వ్యాపించి ఉన్నది? ఈ అధర్మం అసలు ఎందుకు ఉన్నట్లు? మనం మంచిగా ఉండాలి సరే! కానీ సర్వత్రా వ్యాపించిన చెడు నుండి ఆసురీ ఆక్రమణల నుండి ఆత్మరక్షణ గావించుకోడానికి యే యే మార్గాలను ఆశ్రయించాలి? జగత్తును పీడించి, వేధించే దుష్టశక్తుల నివారణకు మార్గ దర్శనాన్ని తెలియజేయని పక్షంలో ఆధ్యాత్మ జ్ఞానానికి సంబంధించిన ప్రసంగాలు అసంపూర్ణంగా మిగిలిపోతాయి. అని దుర్వాసుడు కోరగా, పిప్పలాద మహర్షి ఈ విధంగా బదులు పలికారు.

శ్లో॥ రుచేర్భవత్ ఆసక్తేరపి చాత్ర సమర్ధనామ్ ।
సమాధానం చ సమ్మానం బ్రహ్మ విద్యా విధేవరమ్ ॥
అనీతేః ప్రతిరోధో అపి నీతి పక్ష సమర్ధనమ్ ।
ఏకమాస్తే తథాస్యాపి మహత్వం విద్యతే ధృవమ్ ॥

**ఋ**షి గణాలలో ఎవరి విశిష్ఠత వారిదే. దూర్వాసుని విశిష్ఠత అవినీతికి విరుద్ధంగా ధ్వజమెత్తటం. ఆధ్యాత్మ జ్ఞానానికి ఒక పక్షం తవశ్చర్య, భక్తి, పరమార్ధం అయితే, దుష్టత్వంతో పోరాడటం రెండవ పక్షం. ఈ రెండవ పక్షం గూర్చి ప్రాజ్ఞుడైన పిప్పలాద మహర్షి జిజ్ఞాసువులకు తెలియజేయాలని ఉపక్రమిస్తూ, మహర్షులారా! బ్రహ్మ విద్యలో అవినీతికి విరుద్ధంగా జరిపే పోరాటానికి ప్రముఖ స్థానమున్నది. బ్రహ్మ విద్య, సాధనా విజ్ఞానం, గీత, దుర్గాసప్తశతిలలో సాధనా సమరం, అవినీతిపై పోరాటం గూర్చిన పూర్తి వివరణ ఉన్నది. అంతరంగంలోని కుసంస్కారాలతోను, బాహ్య, క్రమణలతోను జరిపే యుద్ధమే ఈ రెండు గ్రంథాలలోని మూల విషయం. ప్రతీ అవతార ఆవిర్భావ సమయంలోను, ప్రతీ యుగంలోను ఆవాంఛనీయత, ఆనైతికతలతో యుగానుకూలంగా పోరాటం జరుగుతూ వస్తూనే ఉన్నది. వినాశనం-సృష్టి, ఉద్ధరణ-పతనం, మంచి-చెడు ఈ విధంగా భగవత్ శక్తి యొక్క రెండు పక్షాల గూర్చిన చర్చ అనవరతము ఆధ్యాత్మ గ్రంధాలలో జరుగుతూనే ఉంది.

శ్లో॥ సంసారే అవాంఛనీయత్య మతయేవ తు విద్యతే ।
సహను భూతిం కుర్యాత్తన్యాయనిష్ఠాం ప్రతిసదా ॥
సమర్థనేచ తస్యాహి ప్రఖరం తత్పరాక్రమమ్ ।
కర్తుంచ ప్రేరయేద్ రాత్రి ర్నోచే చ్ఛ్రైష్ఠ్యయం దినస్యన ॥

**వి**శ్వంలో అలముకొన్న అవాంఛనీయత కూడనిదిగానూ, అనవసరమైనదిగానూ భావించనవసరం లేదు. న్యాయ నిష్ఠపట్ల సానుభూతి, సదవగాహన ఉత్పన్నం కావటానికి, పరాక్రమాన్ని చూపటానికి ఆవాంఛనీయత ద్వారా ప్రేరణ లభిస్తుంది. రాత్రి అనేది అసలు లేనేలేని పక్షంలో పగటి యొక్క విశిష్ఠత తెలిసేదేకాదు. దైవం తన వారసుడైన మానవుని పరీక్షించటం నిమిత్తం అవాంఛనీయతను సృష్టించటం జరిగింది. అవినీతి అనేది లేనేలేనపుడు నీతియొక్క గరిమ మానవాళికి ఎలా అర్ధమవుతుంది. అధర్మం ఉన్నపుడేకదా ధర్మస్థాపన కోసం ప్రయాసపడటం జరుగుతుంది. అజ్ఞానాంధకారం ద్వారా జరిగే హాని నుండి బయట పడటానికి మానవుల ద్వారా జ్ఞానసాధన చేయబడుతోంది. అందుకే అనవసరం, హానికరమని తెలిసికూడా సృష్టికర్త తన పవిత్ర సృష్టిలో అవాంఛనీయతకు కూడా స్థానాన్నీయడం జరిగింది. ఆటలలో గెలుపు ఓటమీ ఉంటుందని తెలిసికూడ ఆటగాడు తన నైపుణ్యాన్ని పెంచుకోవటం కోసం తనకంటే బలవంతుడు, నిపుణుడు అయిన వ్యక్తితో పోటీలో నిలబడుతూ ఉంటాడు. ఈ విషయంలో శిక్షకుడు, మార్గదర్శకుడూ ఏమాత్రం దయనుగాని, సానుభూతిని కానీ చూపించడు. ఇదే విధంగా భగవంతుడు కూడా ఒక పరీక్షకుడే. తన పుత్రుడు సమర్థుడు, శక్తిమంతుడూ కావటం కోసం మంచి చెడుల మధ్య పోరాటాన్ని యేర్పాటు చేసి రంగంలోకి దించి ఆడిస్తూ ఉంటాడు. అవినీతి, ఆనాచారంవంటి వాటిని గూడా సతతమూ మనలను పరీక్షించే నిమిత్తమే దైవం ప్రసాదించాడని, నీతి స్థాపనకు ప్రేరణ నీయటానికే అవినీతి చుట్టూ తాండవిస్తోందనీ, అపూర్వమైన ఈ విధి వ్యవస్థలో మానవులు అవాంఛనీయమైనవిగా భావించేవన్నీ కూడ, అవసరార్ధం సృష్టించబడినవేనని మహర్షి జిజ్ఞాసువులకు

అనేక ఉదాహరణల ద్వారా తెలియజేశారు. ఇంటి నిండా చెత్త పేరుకొన్నపుడు, ఆ చెత్తే తనను శుభ్రం చేయమంటూ వ్యక్తిని జాగరూకుడ్ని చేస్తుంది. శరీరంలోని విజాతీయ ద్రవ్యాలు చెమట రూపంలో బహిర్గతమై, స్వచ్ఛతను గుర్తుచేసి, స్నానం చేసి మలినాలను కడుగుకోవలసిందని ప్రేరేపిస్తున్నాయి. ఈ విధంగా నిత్యజీవితంలో మనలను మంచివైపు మళ్ళించటాన్కి ప్రేరణనిచ్చే అనేకమైన చెడులు మన ఎట్టెదుట సాక్షాత్కరించటం చూస్తూనే ఉన్నాము.

**కథ 1 : తో**టలో అందంగా విరబూసిన గులాబిని చూచి బాటసారి, ఇంత అందమైన నీ చుట్టూ ముళ్ళేమిటని విమర్శిస్తాడు. గులాబీ నవ్వి, "సోదరా! పూవుల సుగంధం వ్యాపించేసరికి నలువైపుల నుంచి ఆక్రమణదారులు చుట్టు ముట్టి, మమ్ములను త్రుంచుకు పోవాలని చూస్తారు. కాబట్టి ఈ ముళ్ళు ఆత్మరక్షణ కోసం మాకు తప్పనిసరిగా ఉండి తీరాలి". అని బదులు పల్కింది.

**కథ 2 : భా**రతదేశం వెనుకబడటానికి కారణమేమిటని కొందరు రామతీర్థుని ప్రశ్నించారు. భారత భూమిలో వికసించిన ధర్మం, సంస్కృతి అనే అందమైన పూలగుత్తులను మధ్యకాలంలోని విలాస ప్రియులు నిర్దాక్షిణ్యంగా త్రుంచి వేయుట వలన భౌతిక ఔన్నత్యం అపహరించబడినది. ధర్మం, సంస్కృతి అనే ఆ పూవుల గుత్తుల చుట్టూ ముళ్ళు రాళ్ళూ కూడ ఉండి ఉంటే, వాటి మధ్య భారతీయుల జీవిత ఉద్యానవనం సురక్షితంగా పెరిగి వికసించేది. ఆదర్శాలకు, భౌతిక ఉన్నతికి ధర్మానికి సంస్కృతికి రక్షకులైన ఓ ముళ్ళు, రాళ్ళలారా! మీకు నా ధన్యవాదాలు. అంటూ రామతీర్థుడు భారతదేశం వెనుకబడటానికి గల కారణాన్ని తెలియజేస్తాడు.

**కథ 3 : రా**మకృష్ణ పరమహంసను ఒక శిష్యుడు, గురుదేవా! మీరు ఇంత గొప్ప సాధకులు కావటానికి కారకు లెవరని ప్రశ్నిస్తాడు. "సాధనలో ఓడిపోయిన అనేకమంది సాధకులని" రామకృష్ణ బదులు పల్కుతారు. అదెలా! అని శిష్యుడు ఆశ్చర్యాన్ని వ్యక్త పరుస్తాడు. ఆశ్చర్యానికేముంది, సాధకులకు యే కారణాల వలన సాధనలో ఓటమి సంభవిస్తుందో గమనించి, ఆ లోపాలు నా సాధనలో జరగకుండా చూసుకొనేవాడిని. ఆ అనుభవం ద్వారానే లాభాన్ని పొంది, సాధనలో ఎదురైన అవరోధాలన్నీ అధిగమించి గమ్యం చేరగల్గేను. నా సాధనా సాఫల్యానికి కారకులు ఓడిపోయిన సాధకులేనని గట్టిగా మరొకసారి పరమహంస నొక్కి పలికేరు.

**శ్లో॥ వ్యాయామ భ వనేయేతు యుద్ధ్యంతే హి పరస్పరమ్ ।**
**శూరావీరాశ్చ జాయంతే బలిష్ఠోనాత్ర సంశయః ॥**
**పరాక్రమో నరస్యాస్తి మహత్వ మహితో గుణః ।**
**ఉదయః సంభవస్తస్య సంఘర్షేణైవ నాన్యథా ॥**

**వ్యా**యామశాలల్లో ప్రతి నిత్యం వ్యక్తులు పరస్పరం పోట్లాడుకొని శక్తివంతులవుతున్నారు. మానవునిలోని మహోన్నతమైన పరాక్రమమనే గుణం, సంఘర్షణ ద్వారానే వృద్ధి చెందుతుంది. సంఘర్షణతో కూడిన జీవితాన్ని గడుపలేని వ్యక్తి ఈ పరాక్రమం, ప్రతిభల నుండి వంచించబడతాడు. తిండి, వ్యాయామం మొ॥నవి సిద్ధాంతానికి ఒక పక్షం. ఇంక వాంఛనీయత, అవాంఛనీయతల మధ్య వ్యత్యాసాన్ని మహోన్నతమైన శక్తి "జాగరూకత", తక్షణం నిర్ణయాన్ని తీసుకొని ఆచరణలో పెట్టగల శక్తి "తత్పరతా", న్యాయ రక్షణ కోసం తీసికోబడే నిర్ణయాత్మక శక్తి "ప్రఖరత". ఈ మూడు దివ్యగుణాలు అవినీతితో పోరాడి, న్యాయాన్ని సమర్ధించగల వారిలో మాత్రమే వికసించి వృద్ధిచెందుతాయి.

**ఉచ్ఛ్వాస నిశ్వాసాలను క్రమబద్ధం చేస్తే ఆలోచనలో అలజడి తగ్గుతుంది.**

విశ్వ ఇతిహాస వీచికలు విశ్వాన్ని ఒక యుద్ధభూమిగా పేర్కొనడం జరిగింది. ఇక్కడ వ్యక్తులు, సమూహాలు, రాష్ట్రం, తమతమ సిద్ధాంతాలను, ఆదర్శాలను రక్షించటం కోసం పోరాటాన్ని సాగిస్తూ ఉంటారు. నిజానికి ఈ సంఘర్షణే శ్రేష్ఠతకు ఆధారభూతమైనది. ఈ యుద్ధభూమిలో అనాదిగా మానసిక దుర్బలులు, ఆదర్శహీనులు మాత్రమే ఓడిపోతూ వచ్చారు. సత్యం, న్యాయం, ఆదర్శం వీటిప్రక్కన ఉండి పోరాడే వ్యక్తులను ఎవ్వరూ కూడ ఓడించలేకపోయేవారు. వారినే విజయలక్ష్మి వరించి తగిన శక్తిని ప్రసాదిస్తూ ఉండేది.

**కథ 4 : ద్రో**ణాచార్యుడు కౌరవుల సేనాపతిగా నియమింప బడ్డాడు. యుద్ధం మొదటి రోజున ద్రోణుడు అత్యంత వీరోచితంగా పోరాడినా, విజయం మాత్రం అర్జునునికే లభించింది. దుర్యోధనుడిది సహించలేక ద్రోణునితో, ఆచార్యా! అర్జునుడు కేవలం మీ శిష్యుడు. తలచుకుంటే క్షణంలో మీరు అతనిని ఓడించగలరు. కానీ ఈ రోజు అర్జునుడినే గెలిపించడం ఆశ్చర్యంగా ఉంది. అని ప్రశ్నిస్తాడు. ద్రోణుడు గంభీర స్వరంలో, దుర్యోధనా ! నీవు చెప్పినట్లు అర్జునుడు నా శిష్యుడే. అతని విద్యను గురించిన రహస్యం నాకు పూర్తిగా తెలిసినదే. కానీ ఇక్కడ విశిష్ఠత ఏమిటంటే అర్జునుని జీవితం అనుక్షణం కష్టసుఖాల మధ్య పోరాటం సాగిస్తూ గడిచింది. నా జీవితం సౌకర్యాల మధ్య సాఫీగా సాగిపోయింది. ఈ వ్యత్యాసం వల్లనే అర్జునుడు నా కంటే శక్తిమంతుడుగా తయారై విల్లు చేతపట్టి నాముందు నిలబడేసరికి నేను ఓడిపోక తప్పలేదని బదులు పలికేడు.

**కథ 5 : ప్ర**ఖరత, జాగరూకత యొక్క అద్భుతమైన సమన్వయం అంగద చరిత్రలో కనిపిస్తుంది. రావణుని మిత్రుడు వాలి యొక్క పుత్రుడు అంగదుని రాముడు దూతగా పంపటం సంభవించింది. రావణుని నిండు సభలో రావణుడు-అంగదుల మధ్య ఉత్తేజకరమైన సంభాషణ జరిగింది. రావణుడు అంగదుని కాలునైనా కదపలేక భయభ్రాంతుడై ఇంక కుటిల నీతిని ప్రదర్శింపక తప్పదని భావించి, "అంగదా! నీ తండ్రిని చంపిన హంతకునికి సహాయం చేస్తూ తండ్రి మిత్రుడిని, పితృ సమానుడను అయిన నాతో విరోధిస్తున్నావా! అని కపట ప్రేమను ఒలకబోస్తాడు. అంగదుడు దానికి పకాపకా నవ్వి, రావణా! అసలైన ధర్మానికి నిర్వచనం అన్యాయంతో పోరాడి, దాన్ని హతమార్చటమే. ధర్మస్వరూపుడైన శ్రీరాముడు ధర్మవిహీనులైన వారందరితో పోరాడి వధించక తప్పదు. నా తండ్రే అయినా, తండ్రిలాంటి తండ్రి మిత్రుడవైనా ధర్మవిహీనులైనప్పుడు వ్యతిరేకించక తప్పదు కదా"! అని ఆవేశంతో పలికే సరికి రావణుడు ఖిన్నుడై బదులు పలుకలేక పోతాడు.

**కథ 6 : జ**నక మహారాజు మందీ మార్బలంతో మిథిలా నగర వీధులగుండా సాగుతూండగా దారిలో ఎవ్వరినీ నడవవద్దని రాజభటులు కట్టుదిట్టం చేస్తారు. శోభాయాత్ర ముగిసేవరకూ ప్రజలు తమ తప్పనిసరి పనులు, అవసరాలు అన్నీ వదలుకొని ఎక్కడివారక్కడ ఆగవలసి వచ్చింది. సరిగ్గా ఇదే సమయంలో ఆ బాటలో వస్తున్న అష్టావక్రుని రాజభటులు తప్పుకోమని ఆదేశించగా, ఆయన నిరాకరించి, ప్రజలకు కన్నతండ్రియైన రాజు కేవలం తన సౌకర్యార్థం ప్రజలను ఈ విధంగా అసౌకర్యానికి గురిచేయటం అవినీతికరమైన చర్య. దీనిని ప్రతిఘటించటం నావంటి బ్రాహ్మణుని బాధ్యత. ఈ విషయం మీ రాజుకి చెప్పండని" పలుకగా రాజభటులు అష్టావక్రుని రాజాజ్ఞను ధిక్కరించిన నేరం క్రింద బంధించి రాజుముందు ప్రవేశపెడతారు. **అవినీతితో ఇంత నిర్భీతిగా పోరాడగల బ్రాహ్మణుడే రాష్ట్రం యొక్క అసలైన సంపదగా** పేర్కొంటూ జనక

**వ్యసనాలకు బానిసయై పసిడిని కోల్పోవు నరుడు, పగటిపూట చంద్రునివలె పాలిపోడె కళలు తరిగి.**

మహారాజు అష్టావక్రుని క్షమార్పణ కోరి, రాజగురువు పదవిని చేపట్టవలసిందిగాను, న్యాయపక్షాన్ని సమర్థిస్తూ ఇదే విధంగా అవినీతితో పోరాడవలసిందిగాను ప్రార్థిస్తాడు.

**కథ 7 : వి**వాహ వేదిక మీదనున్న రామదాసు "సావధాన్" అనే మాట విని వేదికనుండి దూకి, యుగానురూపమైన సాధనలో లీనమవుతాడు. జనులలో సంసర్క భావనను నింపటానికి, అవినీతికి విరుద్ధంగా పోరాడటానికి, గ్రామగ్రామం తిరుగ సాగిన రామదాసుని చూచి అనేక మంది ప్రతిభావంతులైన యువకులు ప్రభావితులై ఆయనను అనుసరించ సాగేరు. వీరిలో మరాఠీ యువకుడైన **శివాజీ** ప్రముఖుడు. ధర్మవీరుల నివాస నిర్వహణార్థం అనేకమైన వ్యాయామశాలలను, హనుమాన్ దేవాలయ రూపంలో నిర్మించిన ఈ మహనీయుడు సాధువు అయిఉండి కూడా, సమర్థ గురువుగా కీర్తించ బడ్డాడు.

**కథ 8 : బం**కించంద్ర్ ప్రభుత్వ ఉద్యోగి. ఆనాటి పరిస్థితులు ఆయనచేత **"ఆనంద మఠాన్ని"** రచియింప చేశాయి. **వందేమాతరం** అనే జయఘోషను తొలిసారిగా వినిపింప జేసిన మహనీయుడీతడే. ఈ నవల బానిసత్వపు బంధనాల నుండి దేశానికి ముక్తిని ప్రసాదించటం కోసం రహస్యంగా సేనను తయారుచేసి పోరాడుతూనే ప్రాణత్యాగం చేసిన దేశభక్తులైన సన్యాసుల కథ. కేవలం ఈ నవల, వందేమాతరం అనే జయఘోషను దేశం నలుమూలలా వ్యాపింపచేసిన క్రాంతి కిరణాల ప్రవాహం. అత్యాచారులు, అన్యాయపరులు అయిన విదేశీ శానకులను గడగడలాడించి వేసింది. ఇంతటి సాహసం ప్రఖర ప్రతిభా సంపన్నులకే సాధ్యమవుతుంది.

శ్లో॥ **అజ్ఞానం చాప్యభావశ్చ శ్రేణ్యామస్యాం నిరూపితే ।**
**దేవాస్త్రయో జ్ఞానకర్మౌ దార్యనామాన ఏవతే ॥**
**అజ్ఞాన మథసో అభావో అన్యాయశ్చైతేత్రయో సురాః ।**
**విద్యంతే అనాదికాలాచ్చ యుద్ధద్యతేతు త్రయస్త్రిభిః ॥**
**దైవాసురస్తు సంగ్రామ ఏష ఏవాస్య హేమునే ।**
**ధర్మక్షేత్రే కురుక్షేత్రే మహాభారత కస్యతు ॥**

**జ్ఞాన, కర్మ, ఔదార్యాలనబడు ముగ్గురు దేవతలకు అజ్ఞానం, అన్యాయం, అభావం అనబడే ముగ్గురు అసురులకు మధ్య అనాదిగా పోరాటం జరుగుతూనే ఉంది.** ఇదే అసలైన దేవాసుర సంగ్రామం. సాధనా సమరంలో శూరులు, వీరులు, యోధులు మహాభారత యుద్ధభూమి యొక్క ధర్మక్షేత్రం, కురుక్షేత్రాలలో పోరు సాగించినట్లే నిరంతరము పోరాడవలసి వస్తుంది. సాహసం చూపలేని వారు అర్జునునిలా మోహగ్రస్తులై అవమానాన్ని సహించవలసి వస్తుందే గాని, పోరాటాన్ని మాత్రం తప్పించుకొనజాలరు. అంతర జగత్తులోని సమర భూమిలో ప్రతీవ్యక్తి ఈ యుద్ధంలో పాల్గొనక తప్పదు. ఏ వ్యక్తికైనా ఈ ముగ్గురు అసురులను ఈ ముగ్గురు దేవతలద్వారా ఓడించి గెలవటం తప్పిస్తే వేరే మార్గం మరేదీలేదు.

సంకీర్ణ స్వార్థపరత్వం నుండి రక్షించి, విశాల భారతాన్ని స్థాపించటం కోసం సాక్షాత్తు కృష్ణ భగవానుడక్కడ ఉండికూడా యుద్ధం జరుగకుండా ఆపలేకపోయాడు. కాబట్టి ఈ విధంగా అవినీతితో పోరాటం సాగించలేని నాడు మానవునకు అస్తిత్వమనేదే ఉండదు.

**కథ 9 :** ప్రతిచేతుడు అనే రాజు అకారణంగా కోపించి భార్యను త్యజిస్తాడు. అహంకార పూరితమైన

**కత్తిని రాయిమీద నూరడం కత్తిని పదునుపెట్టడానికి కాని రాతిని నునుపు చేయడానికి కాదు. సత్ప్రవర్తన తన ఉద్ధరణకే.**

రాజుయొక్క చర్యకు రాజపురోహితుడు దుఃఖించి రాజును వదలి వెళ్ళిపోతాడు. స్వజనులనే ప్రేమించలేని వాడు ప్రజలను ఏమి ప్రేమించగలడని నిందించి ప్రజలందరు రాజాజ్ఞలను ఉల్లంఘించడం మొదలుపెట్టారు. ఈ పరిస్థితిని గమనించి పరాయి రాజులు దండెత్తి వస్తారు. సైన్య సమేతంగా శత్రురాజును ఎదుర్కోడానికి బయలుదేరిన ప్రతిచేతుడు దారిలో అంగిర మహర్షి ఆశ్రమం వద్ద విశ్రమిస్తాడు. ఒక మహారాజు పట్ల మహర్షి సాధారణ పౌరుని కంటే తక్కువ మర్యాదనిచ్చి ప్రవర్తించడానికి కారణమేమిటని రాజు ఆశ్చర్యంతో ప్రశ్నిస్తాడు. మహర్షి రాజువంక తీక్షణ దృక్కులతో పరికిస్తూ ధర్మరక్షకుడైన రాజు పత్నీ పరిత్యాగము ద్వారా అధర్మాన్ని ఆచరించినపుడు, అతనికిచ్చే గౌరవ మర్యాదలు కూడ అతని ఆచరణకు తగ్గినట్లే ఉంటాయని బదులు పల్కుతాడు. రాజు తన తప్పును అంగీకరించి భార్యను సగౌరవంగా తిరిగి రాజ్యానికి రప్పించి ధర్మరక్షణకై పోరాటాన్ని సాగించడానికి జీవితాన్ని అంకితం చేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు.

**కథ 10 : అ**జ్ఞానాంధకారంలో తిరుగాడే ప్రజలకు వెలుగుబాట చూపటం కోసం అనేకమంది సమాజ సేవకులు, సత్యాగ్రహులు, వివిధ మార్గాల ద్వారా సంఘర్షణ జరుపుతూ వచ్చారు. ఆ రోజుల్లో బాబా రాఘవదాస్ ప్రజలకు పారిశుధ్యం యొక్క ఆవశ్యకతను తెలుపుతూ, అపరిశుభ్రత కారణంగా మహమ్మారి ఎన్ని గ్రామాలను కబళించివేస్తోందో వ్యక్తి వ్యక్తికి అవగతం చేస్తూ, బాటలను ఊడ్చటం, కాలువలు కడగటం, రోగులకు స్నానాలు చేయించి, మలిన వస్త్రాలు ఉతకటం మొ॥ పనులు చేస్తూ, గ్రామగ్రామాలు తిరిగి గ్రామోద్ధరణకు పాటుపడేవారు. ఆయన సేవలు అందుకోవటమే తప్ప రాయిమీద వర్షం కురిసినట్లే అజ్ఞానులైన గ్రామవాసులలో కాస్తకూడా మార్పురాలేదు. ప్రజలు అతనిని నిరుత్సాహపరచ ప్రయత్నించినపుడు వారు కాస్తయినా చలించక “సోదరులారా! ఈ పల్లె ప్రజలను సంవత్సరాల తరబడి అజ్ఞానాంధకారాల్లో మ్రగ్గుతూంటే ఉపేక్షించటం జరిగింది. కాబట్టి నిస్వార్థ భావనతో ఓర్పుగా సేవచేస్తూ ఎదురు చూడగల్గితే ఏదో ఒకనాడు వీరిలో స్వచ్ఛత, సంస్కారము తప్పక ఉత్పన్న మవుతాయి”. అని తెలియ చెప్పేవాడు. చివరకు జరిగింది కూడ అదే. ఆయన చుట్టు ప్రక్కల వంద గ్రామాలను తన కార్యక్షేత్రంగా పెట్టుకొని ప్రజలను సంస్కారవంతులుగా తీర్చి దిద్దటంలో విజయం సాధిస్తాడు.

**కథ 11 : మ**హాత్ముడైన ఆనందస్వామి శ్రమశీలత యొక్క గొప్పతనాన్ని వివరిస్తూ, శిష్యులకొక కథ వినిపిస్తాడు. “నాయనలారా! ఒకానొకప్పుడు అనేకమైన వ్యాధులన్నీ కలసి ఒక ఎత్తైన పర్వతంమీద నివసిస్తూ ఉండేవి. కొంతకాలానికి రైతులకు వ్యవసాయానికై భూమి కావలసివచ్చి ఈ పర్వతాన్ని పగులగొట్టి దానిక్రింద నేలలో వ్యవసాయం చేయాలని నిర్ణయించుకొంటారు. వందలమంది వ్యవసాయదారులు ప్రోగై పర్వతాన్ని పగుల గొట్టడంలో నిమగ్నులు కావటంతో, పర్వతం ఆత్మరక్షణకై ఉపాయాన్ని ఆలోచించి తనపై నివసించే వ్యాధులన్నిటినీ తన శత్రువులైన రైతుల మీదికి వదలి, వారిని సర్వనాశనం చేయమని ఆజ్ఞాపించింది. వ్యాధులన్నీ సామూహికంగా రైతులమీదికి ఉరికాయి. తమను ఆవహించిన వ్యాధులను రైతులు యేమాత్రం లక్ష్యపెట్టక ఉత్సాహంతో పనిలో నిమగ్నులై ఉండటం చూచి, వ్యాధులు నీరుగారి చెమట రూపంలో భూమిపై వ్రాలి ధూళిలో కలిసిపోయాయి. ఆనాటినుండి **వ్యాధులు మాలిన్యంలోను, సోమరుల శరీరంమీద నివశించటం ప్రారంభించాయి. శ్రమశీలతకు భయపడి దారిద్ర్యం, లోటుపాట్లుతోపాటు వ్యాధులు, బాధలు కూడా పరెగుత్తి పారిపోతాయని** ఈ కథ ద్వారా ఆనందస్వామి శిష్యులకు తెలిసినది.

**కథ 12 : బు**ద్ధుడు పాట్నా నగరం వెళ్ళినప్పుడు ఆయన దర్శనార్థం వచ్చిన నగర ప్రముఖులు,

బుద్ధుడు దురాచారులు, దుష్టులు నివశించే ప్రాంతంలో బసచేయటం చూచి ఆశ్చర్యంతో -"స్వామీ! ఇంత మహాపట్నంలో మీకు బసచేయటానికి ఈ ప్రాంతమా దొరికింది? పెద్దపెద్ద మా భవనాల తలుపులు మీకోసం ఎప్పుడూ తెరచి ఉంటాయి, రమ్మంటూ ఆహ్వానిస్తారు. వారి ఆహ్వానాన్ని బుద్ధుడు చిరునవ్వుతో నిరాకరిస్తూ, "అయ్యలారా! వైద్యుడు చికిత్స చేయటానికి రోగగ్రస్తుల వద్దకే వెళ్ళవలసి ఉంటుంది. ఈశ్వరుని పుత్రులందరూ పతితులను సేవించటానికే దిగివస్తూంటారు. కాబట్టి వారి నివాసస్థానం కూడా పరిస్థితుల మధ్యనే ఉండటం సమంజసమని" పల్కుతాడు.

బాపూ ఎప్పుడూ హరిజనవాడలోనే బసచేస్తూ, వారి అజ్ఞానాన్ని లోటుపాట్లను తొలగించటానికి స్వయంగా కృషి చేస్తూ అజ్ఞానం, అభావం అనబడే అసురులతో పోరాడమంటూ సదా వారికి ప్రేరణ నిచ్చేవారు.

**శ్లో॥ మక్షికా మశకా యూకా మత్కుణా మూషకాదయః ।**
**వృశ్చికాదయ ఏతేఽస్మాన్ వివశాన్ కుర్యతే భృశమ్ ॥**
**ఆత్మరక్షాం ప్రకర్తుంతాన్ దూరీకర్తుం మహామునే ।**
**ఆక్రాన్తున్ సాహసం గ్రాహ్యమిత్థం సర్వ త్ర దృశ్యతే ॥**
**అనౌచిత్యస్య సహనాత్తు స్వమస్తిత్వం విపద్యతే ।**
**ద్వితీయాహాని రేషాస్యాధా క్రాన్తారస్తు నిర్భయాః ॥**

ఈ జగత్తు అంతటా వ్యాపించియున్న ఈగలు, దోమలు, నల్లులు, పేలు, ఎలుకలు, పాములు, తేళ్ళు మొ॥నవి అనేకం మనకు ఆత్మ రక్షణకు యేర్పాట్లు గావించుకోండని ఆక్రమణదారులను హతమార్చమని ప్రేరణనిస్తున్నాయి. అలాగే ఇటువంటి స్వభావంకల వ్యక్తులు కూడ మన చుట్టూ సమాజంలో అనేకమంది ఉంటానే ఉన్నారు. నిజానికి వీరు సమాజానికి ఏ మాత్రం మేలును చేయలేరు. అయినప్పటికీ ఎందుకు సృష్టించబడినట్లు ? అవినీతిని, అన్యాయాన్ని ఎదుర్కోమని, వాటితో పోరాడమని వ్యక్తులకు ప్రేరణనివ్వటానికే! అనౌచిత్యాన్ని సహిస్తూ కూర్చోవటం వల్ల మానవుని యొక్క అస్థిత్వమే చిక్కుల్లో చిక్కుకొంటోంది. ఇక రెండవ హాని ఏమిటంటే ఆక్రమణదారులు తమకు అడ్డునిలబడేవారు లేక స్వేచ్ఛగా తమ దుష్టత్వాన్ని రెట్టింపుచేసి, సమాజాన్ని విపత్కర పరిస్థితులకు గురిచేస్తున్నారు. పరిస్థితులు అన్యాయానికి అనుకూలంగా ఉన్నప్పుడు దుష్టులు, దురాచారులు అత్యంత శక్తివంతులై అతితక్కువ మందే అయినా, అనేక మంది విపత్తులకు కారణమవుతున్నారు. దుష్టత్వాన్ని సహిస్తూ కూర్చోవట మనేది మానవుని వంటి ఉత్కృష్ట ప్రాణికి సిగ్గుచేటు. ఇంతకు మించిన అవమానకరమైన విషయం మరొకటి లేదనే చెప్పాలి.

**కథ 13 :** సజ్జనత్వం అనివార్యమే. కానీ కృతఘ్నులపట్ల అప్రమత్తంగా ఉండటం ఇంకా ముఖ్యం. లేకుంటే హాని సంభవించే ప్రమాదమున్నది.

సంధ్యాసమయాన ఒక హంస తన నివాస స్థానానికి వస్తూ, మార్గమధ్యంలో చలితో వణకుతూ ప్రాణభీతితో బాధపడుతున్న ఎలుకను చూచింది. సహజంగా సజ్జన స్వభావం కావటంవల్ల హంసకు దయకల్గి, ఎలుక వద్దకు వెళ్ళి తన రెక్కలను విప్పి చలిబాధనుండి ఎలుకను కాపాడసాగింది. హంస చేసిన సహాయానికి ఎలుక శరీరంలో వేడి పుట్టి, కాస్త శక్తి పుంజుకోగానే దాని సహజ స్వభావంతో హంస రెక్కలను కొరికివేయసాగింది. ఇంతలో తెల్లవారి సూర్యకిరణాలు భూమిపై ప్రసరించసాగేయి. హంస తన నివాసానికి బయలుదేరాలని

ప్రయాణమై, ఎగరలేక భూమిపై పడిపోయింది. ఎలుకయొక్క కృతఘ్నత పట్ల దానికి చాలా దుఃఖం కల్గింది.

**కథ 14 :** కలసి ఉండాలనుకొనే వ్యక్తులను బాగా ఆలోచించి ఎంపిక చేసుకోవాలి. పైపైన స్నేహాన్ని ప్రదర్శిస్తూ లోపల ద్వేషాన్ని నింపుకొని, అవకాశం ఎప్పుడు చిక్కుతుందా, ఇతరులను అవమానించి హాని చేద్దామా అని చూస్తూండే వ్యక్తులు ఎంత మాత్రం కలసి ఉండటానికి పనికిరారు.

ఒకనాడు హంస, కాకి కలసిమెలసి జీవించేవి. తన సహజ స్వభావాన్ని అనుసరించి కాకిపట్ల సద్భావాలతోను శుభకామనలతోను మెలుగుతూ ఉండేది. కానీ కాకి మాత్రం హంస పట్ల లోలోపల ఈర్ష్యా, ద్వేషాలను నింపుకొని, ఎప్పుడు హాని చేద్దామా అని ఎదురు చూచేది. ఒకనాడు ఒక వేటకాడు అలసి, అవి నివసించే చెట్టుక్రింద విశ్రమించగా కొంతసేపటికి అతని ముఖముమీద తీక్షణమైన సూర్యకిరణాలు పడసాగేయి. హంసకు దయకల్గింది. వెంటనే తన రెక్కలను విప్పి బోయవానిపై ఎండ పడకుండా కాపాడసాగింది. ఇదిచూచి కాకి అవహేళన చేస్తూ వెంటనే క్రిందికొమ్మ మీదకు దిగి, నిద్రించే వేటగాని ముఖాన్ని ముక్కుతో గీరి తుర్రున ఎగిరిపోయింది. వేటగాడు కంగారుగా కన్నులు నులుముకొంటూ చుట్టూ కలయచూసేసరికి సరిగ్గా తనపైన కొమ్మమీద హంస కనిపించింది. తనకు ఈ హాని హంసవల్లనే సంభవించినట్లు భావించి కోపంతో దానిని చంపివేస్తాడు.

ఈనాడు సమాజంలో ఎక్కువ మంది ఈర్ష్యా ద్వేషాలతో మంచివారికి హాని కల్గించాలనే దుర్బుద్ధితో పొంచి యున్నారు. కాబట్టి అమాయకంగా వీరితో మైత్రి చేయటంకాక, మానసికంగా వీరికి దూరంగా ఉంటూ, వీరిలోని అసూయా, ద్వేషాలతో పోరాడటాన్కి సామూహిక శక్తిని మేలుకొల్పడం, ఆత్మరక్షణకు తగిన యేర్పాట్లు గావించు కోవడం అనివార్యము. లేనిపక్షంలో మీ ఉపేక్షవల్ల వీరు మరింత ఉద్దండులై ఏ కొద్దిమందికో హాని చేయటానికి బదులు అనేక మందికి హానిచేయగల శక్తి సామర్థ్యాలను సంపాదించుకొనే ప్రమాదమున్నది.

**కథ 15 : ఒ**క దోపిడీ ముఠా ఆయుధాలతో ఒక ధనవంతుల కుటుంబముపై దండెత్తి దోచుకోసాగింది. ఇది తెలిసికూడా ఇరుగు పొరుగు ఎవ్వరూ ఆ కుటుంబ సహాయార్థం ముందుకు రాక ప్రాణభీతితో ఇళ్ళలోనే దాక్కొన్నారు. ముఠా స్వేచ్ఛగా దోపిడీ సాగించి పారిపోయింది. ఈవార్త మర్నాడు రాజుకు తెలిసింది. తన ప్రజల పిరికితనంపట్ల రాజుకి చాలా అసహ్యం కల్గింది. వారి పిరికితనానికి శిక్ష విధిస్తూ గ్రామం మొత్తం అందరికీ దండిగా జుర్మానా విధించేడు. ఆ జుర్మానా మొత్తం ధనాన్ని దోచుకోబడిన కుటుంబానికి సహాయంగా అందజేశాడు. ప్రజల పౌరుష హీనతకు వారికి తగిన గుణపాఠం నేర్పటమే కాక, సైన్యాన్ని పంపి దొంగల ముఠాను వెదకించి కఠిన కారాగార శిక్షను విధిస్తాడు.

దుష్టులు తమ కర్మకు తగిన శిక్షను అనుభవించకుండా తప్పించుకోలేరు. అలాగే చుట్టూ ఒక సంకుచిత పరిధిని గీసుకొని, ఇతరుల బాగోగులతో తమకేమీ సంబంధం లేదని భావించే స్వార్థపరులు, నిర్బలులు కూడా తగిన గుణపాఠం నేర్చుకోకుండా తప్పించుకోలేరు. అన్యాయాన్ని ఎదిరించటానికి కావలసిన ఆత్మబలాన్ని సంపాదించక ఎవ్వరికీ తప్పదు.

**కథ 16 :** శరీరాన్ని శుద్ధంగా ఉంచుకోవడం మన బాధ్యత అని యేవిధంగా భావిస్తున్నామో అదే విధంగా సమాజాన్ని కూడా శుద్ధంగా ఉండేలా చూడటం మన బాధ్యతే. వ్యక్తిగత లాభానికి ప్రాముఖ్యత నిచ్చి

**ఏడుస్తూ అనుభవించేవాడు నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు సలహాకు వస్తాడు.**

సామాజిక కర్తవ్యాలను ఉపేక్షించిన పక్షంలో మనకు అత్యంత ప్రియమైన సాధన సంపత్తులు కూడా ఏదో ఒకనాడు దూషింపబడక తప్పదు. దొంగ మన ఇంటిలోకి రాలేదు కాబట్టి, దొంగను ఎదుర్కోవలసిన అవసరం మనకు లేదు, అని భావిస్తే ఏదో ఒకనాడు ఆ దొంగ మన ఇంటిలో జొరపడి వీరవిహారం చేసేటప్పుడు, అరచి గోలపెట్టినా మనకు సహాయపడటానికి ఒక్కరూ ముందుకు రారు. వ్యక్తి యొక్క అస్థిత్వం సమాజంతో గట్టిగా పెనవేసుకొని ఉండటం వలన సామాజిక దృక్పథం నుండి వ్యక్తులు వేరుపడి, తమ అధికారాలను సురక్షితంగా ఉంచుకోవాలంటే ఎంత మాత్రం సాధ్యంకాదు. వ్యక్తి సమాజంయొక్క అభిన్న అంగము. కావు **అందరి క్షేమమే తన క్షేమంగా** భావించి, ఈ విధమైన కర్తవ్య నిష్టగల జాతులన్నీ సదా కీర్తిప్రతిష్ఠలను, ఆర్థిక ప్రగతిని పొందగల్గుతున్నాయి.

**కథ 17 : రా**జకుమారుడైన స్థావరసర్గుని దుర్మార్గపు ప్రవర్తనల పట్ల రాజు, ప్రజలు కూడ ఎంతగానో వ్యధ చెందటం వలన ఒకనాడు మహారాజైన ద్రుమిలుడు పూజ్యపాదుడైన అశ్వత్థుని శరణు కోరటం జరిగింది. గొప్పగొప్ప విద్వాంసుల ద్వారా వినిపించిన నైతిక ఉపదేశాలు గానీ, నైతిక శిక్షణగానీ, రాజకుమారునిలో కాస్తయినా పరివర్తన గొనిరాకపోవటంతో అశ్వద్ధ మహర్షి ఒక ఉపాయమాలోచించి, విధిగా తాను అతనిలో పరివర్తన రప్పిస్తానని, తాను వేసిన ప్రణాళికకు ఏ మాత్రం అభ్యంతరం చెప్పటానికి వీలులేదని ఒక షరతు పెడతాడు. ఆ షరతుకు మహారాజు అంగీకరిస్తాడు.

మహర్షి ఆజ్ఞ మేరకు రాజకుమారుని రాజ్యాధికారంనుండి తొలగించి, బందీనిచేసి, అన్నం నీరు కూడా లభించని ఒక ద్వీపానికి పంపివేస్తారు. అతివృష్టి కారణంగా రాత్రి సుఖంగా నిద్రకూడా పట్టేదికాదు. పగలంతా క్రూరజంతువుల భయం. ప్రకృతియొక్క ఈ కఠోర యాతనవల్ల, మహర్షి ఆశించినట్లుగా స్థావరసర్గుని దర్పం, అహంకారం నశించసాగేయి. శరీరం బాగా శుష్కించింది. ఈ విధంగా గడువు పూర్తిచేసి రాజ్యానికి తిరిగివచ్చిన స్థావరసర్గుని ముఖమండలం కరుణతో ప్రకాశించ సాగింది. మానవమాత్రులు సాధించలేని దాన్ని ప్రాకృతిక దండనా వ్యవస్థ సాధించటం పట్ల రాజు, రాజ్యంలోని ప్రజలు కూడా అత్యంత ఆనందభరితులవుతారు.

**కథ 18 : త**న జీవితం విపత్తులలో చిక్కుకొంటుందని తెలిసికూడా విభీషణుడు రావణుని అవినీతికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ, **"తన ఉరకుమతి బసీ విపరీత - హిత అనహిత మానహు రిపుప్రీత"** " ఓ అన్నా ! నీలో నివాసం చేస్తున్న చెడుబుద్ధి కారణంగా నీ మనస్సు వ్యతిరేక దిశలో ప్రయాణం సాగిస్తోంది. దీనివల్ల నీకు మంచి చెడుగాను, మిత్రుడు శత్రువుగాను భావన కల్గుతోంది". అని పలుకగానే విద్యా సంపన్నుడైన రావణునికి సోదరుడు, శ్రేయోభిలాషియైన విభీషణుని సలహాకూడా వ్యతిరేకంగానే తోచింది. ఆవేశంలో అతడు విభీషణుని నిందిస్తూ "నా రాజ్యంలో ఉండి, నా శత్రువుని ప్రేమిస్తున్న నిన్ను వెంటనే నా రాజ్యంనుండి బహిష్కరిస్తున్నాను. అతని వద్దకే వెళ్ళి నీ నీతిపాఠాలు అతనికే బోధించు". అని చెప్పి సభనుండి వెడలగొడతాడు.

హితులు, శ్రేయోభిలాషులు నచ్చ జెప్పినా చెడు మార్గాన్ని వీడని వారితో సంబంధ బాంధవ్యాలను తక్షణం వదలి వేయటం ఉత్తముల లక్షణం గాబట్టి విభీషణుడు లంకను వదలి రాముని శరణువేడి చివరకు రావణ పతనానికి కారణమవుతాడు.

**శ్లో॥ అనీత్యాచరణం పాపం యథాభీరుతయా తథా ।**
**తస్యా అప్రతి రోధశ్చ పాపమేవాను విద్యతే ॥**

**స్నేహం దుఃఖాన్ని భాగిస్తుంది ; ఆనందాన్ని హెచ్చిస్తుంది.**

వస్తుతో భీరవస్తే హి దుష్టతాం పోషయంత్యలమ్ ।
వరం సంఘర్ష శీలాస్తే స్వయం గృష్ణంతు హానికామ్ ॥
పరం సాహసికా తేషాం ధర్మనిష్ఠాతు యాతయా ।
నిర్ధోషాణామసంఖ్యానాం రక్షాభవతి సర్వదా ॥

**అ**వినీతిని అవలంబించడ మెంత దోషమో, పిరికితనం వల్ల అవినీతిని ప్రతిఘటించకుండా ఊరుకోవటం కూడా అంతే దోషం. వాస్తవం చెప్పాలంటే పిరికివాళ్ళే దుష్టత్వం వృద్ధి చెందటానికి కారకులు. చెడుని ప్రతిఘటించేవాళ్ళు, ఎదుర్కొని పోరాడే వాళ్ళు ఒక్కొక్కసారి వ్యక్తిగతంగా చిక్కులలో పడినప్పటికీ, సాహసంతో కూడిన వారి ధర్మనిష్ఠ వల్ల అసంఖ్యాకులైన నిర్దోషులకు రక్షణ కల్గుతుంది.

**కథ 19 :** సత్యాగ్రహ సమయంలో గాంధీజీ అనుయాయులందరూ జైళ్ళను నింపుతూ, లాఠీ దెబ్బలు తింటూకూడా ఒక్కొక్కరుగా ముందుకు ఉరికి జాతీయ ఝండా గౌరవాన్ని కాపాడటం కోసం తుపాకీ గుళ్ళకు బలి అయ్యేరేగానీ, అత్యాచారుల్ని మాత్రం వదలనే లేదు. స్వతంత్ర్యం తిరిగి ఇచ్చేటందుకు వారిని వివశుల్ని చేశారు.

శివాజీ తిరుగుబాటు పూర్తి విజయాన్ని సంపాదించింది. సంఖ్యా బలం రీత్యా అతి తక్కువ మంది అయి ఉండి కూడా వెనుక అడుగు వేయక, బుద్ధిబలంతో పడమర ఒడ్డున ఉన్న అనేక రాజ్యాలను జయించేరు. ముక్కముక్కలై విడిపోయిన భారతభూమికి సంఘర్షణ ద్వారానే గుణపాఠాన్ని నేర్పటం జరిగింది. సమకాలికుడైన బుందేల్‌ఖండ్‌కు చెందిన చంపత్‌రాయ్, ఛత్రపాల్‌యొక్క తండ్రి తమ లోటుపాట్లు, పరాజయానికి కారణాలు తెలుసుకొని శివాజీ సలహాతో అతని ఆదేశం మేరకు ధైర్యంగా వారిని వారు సంఘటిత పరచుకొని, శత్రువులపై విజయాన్ని సాధించారు. స్వతంత్రతా ఆందోళన సమయంలోని అమరవీరులు వ్రేళ్ళమీద లెక్కించ వలసిన మహనీయులు. ఎదురుగ బ్రిటీష్ సామ్రాజ్యంతో పరాధీనులై నిద్రించే భారత ప్రజానీకాన్ని నిద్ర లేపటంకోసం వారి ప్రాణాలనే బలిగా ఇచ్చి, స్వాతంత్రోద్యమాన్ని ఒక చక్కని బాటను వేసి, తరతరాలుగా వారి ధర్మనిష్ఠ ప్రజలకు గుర్తుండిపోయేలా చేశారు.

**కథ 20 : 12** సం॥ల వనవాసం తర్వాత ఒక సంవత్సరం అజ్ఞాత వాసం చేసే సమయంలో పాండవులకు బకాసురుని యొక్క అత్యాచారం గూర్చి సమాచారం అందించి అతన్ని వధించమంటూ కుంతి భీమసేనుని పంపాలని నిర్ణయించింది. ఇది తెలిసి యుధిష్ఠిరుడు, దీనివల్ల తమ అజ్ఞాతవాసం భంగమై తిరిగి 12 సం॥ల వనవాసం అనుభవించవలసి వస్తుందని వారికి తెలియ చేస్తాడు. ఇది విని భీమసేనుడు ఆవేశంతో, "అన్నా! అన్యాయాన్ని, అత్యాచారాన్ని నశింపచేసి న్యాయరక్షణ చేయటం కోసం ధర్మనిష్ఠ కలవారికి పెద్దపెద్ద కష్టాలను కూడా సహింపక తప్పదు. నాకు ఆజ్ఞ ఇవ్వటానికి ఆలస్యం చేయకు" అంటూ పల్కడంతో యుధిష్ఠిరునికి అంగీకరించక తప్పలేదు. తర్వాత భీమసేనుడు బకాసురుని వధించి కీర్తి ప్రతిష్ఠలను పొందుతాడు.

ఇలాగే మరొక సందర్భంలో పాండవులు మారు వేషాలతో విరాట్‌రాజు కొలువులో ఉన్నప్పుడు కీచకుడు ద్రౌపది యొక్క శీలాన్ని అపహరింప ప్రయత్నిస్తాడు. ద్రౌపది భర్తలయిదుగురికి ఈ విషయం చెప్పినప్పటికీ, వారు వారి అజ్ఞాతవాసం భంగం అవుతుందని భయపడుతూ ఉంటే, కేవలం భీముడొక్కడూ రాబోయే విపత్తులను గూర్చి ఆలోచించకుండా, దుష్టుడు, దురాచారుడు అయిన కీచకుని అంతం చేయటానికి అత్యంత ప్రాధాన్యత నిస్తాడు.

**ఘన పదార్థాలను ద్రవంలా మారేవరకూ నమలాలి. ద్రవ పదార్థాలను నిదానంగా లాలాజలంతో నమిలి మ్రింగాలి.**

**కథ 21 : గు**రుగోవిందసింహ్ చమకౌర్ కోటలో ఆక్రమణదారులను ఎదుర్కోవటానికి సైన్యాన్ని సిద్ధం చేస్తుండగా సరిగ్గా కోటలో ప్రవేశించే ముందు, అతని కుమారులిద్దరూ వెనక ఉండిపోవటంతో దూతలు వచ్చి మొగలాయి సైన్యం కోటను ఆక్రమించబోతున్నదని చిన్న బిడ్డలిద్దరూ వెనుక ఉండి వారికి చిక్కిపోయారని రోదించ సాగేరు. గోవిందసింహ్ ఆతృతతో నా బిడ్డలు ప్రాణభీతి వల్ల శత్రువుకి తలవంచి వారి ధర్మాన్ని స్వీకరించటం లేదు గదా? అని ప్రశ్నిస్తాడు. దూతలు మరింతగా రోదిస్తూ, అలా చేయకపోవటం వలననే నవాబు వారిని దారుణంగా హతమార్చాడని, వారు ఆనందంతో దేహత్యాగం చేశారని తెలియ జేస్తారు. ఈ వార్త విని గోవింద్ సింహ్ శిరస్సు గర్వంతో పైకి లేచింది. అసలైన ధర్మవీరులు ఆ ఇరువురే. సంస్కృతి సర్వస్వం కూడా ఆ ధర్మమూర్తులను గౌరవిస్తుంది. ఆదర్శమూర్తులైన వారిని చూచి మనం పాఠం నేర్చుకోవాలని ఆయన ఆనందంతో పల్కుతాడు.

**కథ 22 : ఆశ, ఉత్సాహం, గతియొక్క సమన్వయం-ఇదే జీవితం.** ఈ మూడు ఎక్కడ లోపిస్తాయో ఆ జీవితం సారహీనమై వ్యక్తి జీవించినా మరణించినట్లే కనిపిస్తాడు. కుకర్మ, కూడని ఆలోచనలు మృత్యువుకు ప్రతినిధులు. కాబట్టి అవినీతికి ఆశ్రయం ఇచ్చేవాడు మరణించినవాడు కాక మరి ఎవ్వడు? ఈ విధంగా రామకృష్ణ పరమహంస బోధనలో తెలియ చెప్పేవారు. వివేకానందు డొకసారి తాను కాశీలో ఒక ప్రదేశానికి వెళుతూ ఉండగా, కోతులు కొన్ని అకారణంగా వచ్చేపోయే వారిని దుఃఖపెడుతూ ఉంటాయని విని ఉన్నాడు. ఆ ప్రదేశంలో అడుగిడగానే ఆ కోతులు వివేకానందుని కూడా బాధించటం మొదలుపెట్టాయి. పెద్దగా అరుస్తూ ఆ దారివెంట ఆయన వెళ్ళటం ఇష్టపడక, కాళ్ళను పట్టుకొని కరవ నారంభించాయి. పరుగుపెట్టే కొలది అవి కూడ పరుగిడి కరవసాగేయి. ఇంతలో ఒక అపరిచితంగా ఉన్న పరిచితమే అయిన కంఠస్వరం “భయపడి పారిపోకు, ఎదుర్కొని పోరాడు” అని పల్కడం వినిపించింది. వెంటనే నిలబడి చేతిలోనున్న ధర్మదండంతో వాటిని ఎదిరించటం జరిగింది. కోతులన్నీ పారిపోయాయి, కాబట్టి జీవితంలోకూడ భయం, కష్టం అజ్ఞానం వీటిని ఎదుర్కోవడానికి సిద్ధపడినప్పుడే అవి మననుండి పారిపోతాయనే గుణపాఠం ఆ కోతుల ద్వారా నేర్చుకొన్నానని వివేకానందుడు ఒక సభలో చెప్పటం జరిగింది.

**కథ 23 : భ**యం, పిరికితనం లేని ధీరులు, సమర్థులుకూడా ఒక్కొక్కసారి నిర్భయుడైన దురాచారుణ్ణి, ఎదుర్కోవటంలో విఫలమవుతూ ఉంటారు. ఒకసారి బభ్రువాహనుడనే రాజు రాత్రిపూట యే పౌరుడూ కూడ రాజ్యంలో పరిభ్రమించరాదని, అలాచేసిన పక్షంలో ఘోరంగా దండింప బడగలరని నిషేధాజ్ఞలు జారీచేశాడు. ఒక రాత్రి సైనికులు గస్తీ తిరుగుతూండగా నిషేధాజ్ఞలను ధిక్కరించి, బాటవెంట తిరుగుతున్న ఒక వ్యక్తి కంటబడ్డాడు. భయపడితే బంధిస్తారని తెలిసి ఆ వ్యక్తి సైనికులతో నిర్భయంగా పల్కుతూ. “ఓ మూర్ఖులారా! నన్ను ఆపకండి. స్వయంగా మహారాజే నా ఆజ్ఞకు బద్ధుడై రాజ్యపాలన చేస్తూ ఉంటాడు. కాబట్టి నాకు నిషేధాజ్ఞలను పాటించ వలసిన అవసరం లేదు”. అంటూ వారిని బెదరించడంతో, సైనికులు గడగడలాడుతారు. ఇదంతా మారువేషంలో నున్న బభ్రువాహనుడు గమనించి ముందుకు ఉరికి ఆ వ్యక్తిని పట్టుకొని, ఎవరు నువ్వని ? గద్దిస్తాడు. ఆ వ్యక్తి భయకంపితుడై రాజు పాదాలపై బడతాడు. భటులవంక తిరిగి, రాజు వారిని కోపించి అధిక సంఖ్యలో ఉండి, అస్త్ర, శస్త్రాలు ధరించికూడా ఎదుటివ్యక్తి దబాయించగానే పిరికితనానికి లోనైతే ఎలా? స్వయంగా మహారాజే నిషేధాజ్ఞలు ఉల్లంఘించి రాత్రిపూట తిరుగుతున్నా కూడ ఆపి, బంధించే పరిస్థితులలో ఉండాలి మీరు. సేవ రక్షణ కార్యక్రమంలోనే విఫలమైన మీరు, రాజ్యాన్ని శత్రుమూక చుట్టుముట్టినపుడు యేమి కాపాడగలరు? అని మందలించి అక్కడనుండి నిష్క్రమిస్తాడు.

**ఆరోగ్యం అతి గొప్ప ఆవశ్యకత.**

శ్లో॥ **ఆతంకవాదినాం భక్తం సాహసం ప్రతిరోధనాత్ ।**
**అతిరిక్తంన మార్గం తత్కిమప్యస్తి మహామునే ॥**
**కః ప్రభావో హింస్రకేషు పశుష్వ్యాస్తే చ దుర్జనాః ।**
**ధర్మోపదేశ చోద్దారః కిం భవంతి విచార్యతామ్ ॥**

**ఉ**గ్రవాదుల ఆట పట్టించడానికి తిరుగుబాటు తప్ప వేరే గత్యంతరం లేదు. క్రూరమృగాలకు బుజ్జగింపులు, లాలింపులు అర్థంకావు. అంగదుని హితోపదేశాన్ని రావణుడు, కృష్ణుని శాంతివచనాలను దుర్యోధనుడు విని మనస్సు మార్చుకో గల్గినట్లయితే లంకా దహనం, మహాభారత యుద్ధం జరిగేవేకావు. దేవతలు ప్రత్యాక్రమణ నుండి తమను తాము రక్షించు కోవటాన్కి దాక్కొన్నా, శాంతి పాఠాలు వల్లించినా, శక్తికి మించి సహనం చూపినా అసురుల బారినుండి ఆత్మరక్షణ చేసికోలేక పోయేవారు.

అవినీతి పక్షాన ఉన్న వారందరూ మానవత్వానికి బద్ధశత్రువులు. వానిని మానవుల జాబితాలో గాక మూర్ఖమైన క్రూరమృగాల జాబితాలో చేర్చక తప్పదు. వీరికి కూడా జంతువుల వలె “తిరుగుబాటు” అనే భాష తప్ప, శాంతి, సంధి సత్పరామర్శ వంటి యే ఇతర భాషలు కూడ అర్థంకావు.

**కథ 24 : హి**రణ్యకశివుడు ప్రహ్లాదునితో నీవుకూడా నావలెనే ధనసంపదను ఆర్జించుకోవలెను. నేను నీ తండ్రిని కావున నీవు నా ప్రతీమాట అంగీకరించి తీరాలి అని పల్కినపుడు ప్రహ్లాదుడు “తండ్రీ! నా నుండి శారీరకంగా నీవు సేవ చేయించుకోవచ్చును. కానీ అనుచితమయిన మీ ఆదేశాలను మానసికంగా నన్ను అంగీకరించమని పలికే అధికారము మీకు లేదు” అని చెప్పి అనేకమైన బాధలను ఆనందంతో సహించాడేగాని, అవినీతిని సమర్థించలేదు. చివరకు సాక్షాత్తు భగవంతుడే ప్రసన్నుడై ప్రహ్లాదుని కోసం దిగివచ్చి హిరణ్యకశివుని వధించి రక్షణ కల్పించాడు. ప్రతీ దుర్మార్గుడు ఈ విధంగానే చివరకు అంతం కాక తప్పదు.

**కథ 25 : మ**నతో ఎవరు యే విధంగా వ్యవహరిస్తే, వారితో మనం అదే విధంగా వ్యవహరించటం అనే నీతి అనాదిగా అమలు పరచబడుతూ వచ్చింది. మహాభారతంలో శ్రీకృష్ణుడు ధర్మరాజుకు నీతి ఉపదేశం చేస్తూ “మాయావినం ఇమంజనం మాయయా బహి భారత మాయావి మాయయా వధ్యః సత్యమే తద్ యుధిష్టిర”॥ మాయావియైన దుర్యోధనుని మాయను మాయ ద్వారానే నిర్మూలించాలి. అసలైన నీతి మాయావిని మాయద్వారానే వధించు అని బోధిస్తున్నది అని తెలియజేస్తాడు.

**కథ 26 : ని**ర్భీతికల సాహసోపేతుడైన వ్యక్తి ఎటువంటి పరిస్థితులలోను కూడా మనోబలాన్ని కోల్పోకుండా, ఆత్మరక్షణ గావించుకొంటూ, తనలాంటి అనేకమందికి ఆదర్శమూర్తిగా నిలచి వారందరూ రాబోయే కాలంలో అవినీతికి అహుతి కాకుండా రక్షించబడటానికి కారణభూతుడవుతాడు.

ఒక పండితుని ప్రవచనం సాగుతూ ఉండగా ఒక బందిపోటు క్షమ, అహింస మానవుని ఆభూషణాలని వీటిని ఎట్టి పరిస్థితులలోను కోల్పోవద్దని పండితుడు ప్రజలకు బోధించటం వింటాడు. ఉపన్యాసం ముగిసి పండితుడు దండిగా దానదక్షిణలు స్వీకరించి తన గ్రామంవైపు వెళ్తూ ఉండగా బందిపోటు అడ్డగించి “స్వామీ! క్షమ, అహింస నీ అభూషణాలు కదా! పైగా వాటిని ఎట్టి పరిస్థితులలోను కోల్పోరాదాయె. కాబట్టి నీవద్దనున్న ధనాన్నంతటినీ క్రింద పెట్టు”మని హెచ్చరిస్తాడు. కానీ పండితుడు యే మాత్రం చలించక ఆత్మరక్షణకై తన

వద్దనున్న కత్తిను తీసి బందిపోటుపై తిరగబడ్డాడు. బందిపోటు భయపడి "నీవు అహింసా వాదివని, నన్ను కొట్టి చంపవని నిరాయుధుడిగా ముందుకు వచ్చాను" అని పలుకుతాడు. పండితుడు నవ్వి "అహింస, క్షమ అనే ఆ రెండు ఆభూషణాలు సజ్జనులకు అలంకరింప వలసినవి. నీవంటి దుష్టుల కోసం ధరింప వలసిన ఆభూషణం లాఠీయే" నంటూ రౌద్ర రూపం దాల్చి బందిపోటును తరిమికొట్టాడు.

**కథ 27 :** జైపూర్ రాజు మాన్‌సింగ్ గుజరాత్ వైపు నుండి వస్తూండగా మేవాడలో విడిది చేస్తాడు. అలాగే చిత్తోడ్ మహారాజు రాణా ప్రతాప్‌సింహ్ అతిథ్యానికి హాజరవుతాడు. ఆ విందులో మాన్‌సింగ్‌తో కలసి భోజనం చేయటానికి స్వయంగా రాకుమారుడైన అమరసింహుని మాత్రమే పంపిస్తాడు. మాన్‌సింహ్ అది అవమానంగా భావించి దానికి గల కారణం అడుగగా, రాణాప్రతాప్ కోపంతో "ధర్మం, జాతి, సంస్కృతి వీటిని అవమానపరచి, అతంకవాదులతో చేయికలిపి తన లాఠీని శతృవులకు అందచేసిన వ్యక్తి పంక్తిని కూర్చొని తాను భుజింపజాలనని బదులు పల్కుతాడు". అవమానింపబడిన మాన్‌సింహ్ ఢిల్లీ తిరిగివెళ్ళి బాదుషాకు చెప్పి తన స్వజాతీయుడైన వీర రాణాతో పోరాటానికి మొగలు సేనను వెంటబెట్టుకొని వస్తాడు. ఆ ఘోర యుద్ధంలో వీరరాజపుత్రు లనేకమంది శత్రువులను చెల్లాచెదరు చేస్తారు. ఓడినారాణా తిరిగి యుద్ధం చేయటానికి నిర్ణయించుకొని, అప్పటి పరిస్థితులకు అనుగుణంగా అరణ్యంలో దాగి ఉండటానికి ఇష్టపడ్డాడేగాని తన స్వాభిమానాన్ని వీడి శత్రురాజుల ముందు తలవంచలేదు. సంధి నిమిత్తం వారు పెట్టిన షరతులన్నీ నిర్భీతితోను, నిర్లోభంతోను తిరస్కరించి, రాబోయే తరతరాలకు ప్రేరణామూర్తియై నిలచేదు.

**కథ 28 :** మహమ్మద్ గజనీ సోమనాథ దేవాలయాన్ని కొల్లగొట్టి తిరిగి వెళుతూ, ఇంకా దారిలో తారసపడిన అనేక ధార్మిక సంస్థలను కొల్లగొట్టి ఆ సంపదను కూడా మూటకట్టుకొని పోవాలని నిర్ణయించుకొంటాడు. కొందరు భారతీయులలోని విఖండిత విరోధం, పిరికితనం కారణంగా అతని ప్రణాళిక చాలావరకూ నెరవేరుతూ వచ్చినప్పటికీ ఒక దగ్గర కేవలం కొద్దిపాటి రాజపుత్ర యోధులు ఒక ప్రణాళిక బద్ధంగా గజనీని చుట్టుముట్టి వీరోచితంగా పోరాడి గడగడలాడిస్తారు. ప్రాణాలను లక్ష్యపెట్టక రాజపుత్రులు సాగించిన ఈ పోరాటం గజనీని కుదిపివేసింది. తిరుగుబాటుని రుచిచూడని అతనిలో ధైర్యం సన్నగిల్లింది. ఇంతవరకూ రాజపుత్ర వీరుల పరాక్రమం, ధైర్యం గురించి కథలుగా విన్నాడేగాని ప్రత్యక్షంగా చూచి ఎరుగడు. ఆత్మగౌరవం కోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించి వదలివేయగల ఆ త్యాగం, వారి సమర్పణా భావం గజనీకి పెద్ద గుణపాఠాన్ని నేర్పింది. వెంటనే అతడు దొరికిన దానినే మూటగట్టుకొని వెనుకకు తిరిగి వెళుతూ **ఈ తిరుగుబాటు కొద్దిపాటి రాజపుత్రులు కాక అందరూ కలసి చేసిఉంటే ఈ గడ్డపై కాలు మోపటంగాని, ప్రాణాలతో తిరిగి వెళ్ళటం గాని సాధ్యమయ్యేదా?** అని గుండె బాదుకొంటాడు.

రాజపుత్రుల చిన్న సైనిక సమూహం యొక్క ఆత్మబలిదానం చరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో శాశ్వతంగా లిఖించబడింది.

**శ్లో॥ అనిత్యాతంక హేతోర్వ్యాఘటనా దుఃఖ దాయికాః ।**
**దృశ్యంతే దృశ్యమానానాం ప్రతిరోద్ధుం మనోభవేత్ ॥**
**అజ్ఞానం చాప్య భావశ్చ వాంఛనీయౌ మతౌతథా**
**యద్యప్యేతౌతు విద్యేతే పరోక్షావ్యక్తిగౌ ధ్రువం ॥**

**ఔ**చిత్యం అనౌచిత్యాల మధ్య వ్యత్యాసం తెలియని స్థితినే **అజ్ఞానమని** అంటారు. కర్మను ఎగవేయటానికి

**లేనిదానికోసం ఆశించేది దుఃఖం. ఉన్నది చాలనుకునేది సుఖం.**

ప్రోత్సహించి, కర్మపట్ల విముఖతను ఉత్పన్నం చేసేదానినే **అభావం** అని అంటారు. ఈ అజ్ఞానం, ఈ అభావం రెండూ అసుర సహోదరులు. వీరివల్ల వ్యక్తి, సమాజం గూడా భీతావహ పరిస్థితులకు గురికాక తప్పదు. కాబట్టి అవినీతిని ఎదుర్కొన్నంత సావధానం గానే ఆజ్ఞానాన్ని, అభావాన్ని గూడా ఎదుర్కొని తీరవలసిందే. ఒక విధంగా చెప్పాలంటే అవినీతిని అంతమొందించటానికి, దానిఇక విరుద్ధంగా చట్టం, రాజకీయ పక్షం అనేక విధాలుగా కృషి చేస్తున్నాయి. కానీ అజ్ఞానాన్ని, అభావాన్నీ అరికట్టడానికి మాత్రం సరియైన ప్రత్యక్ష పరిష్కారాలు యేమీ కనిపించటల్లేదు. కాబట్టి ఈ బాధ్యత **లోకసేవకులు, సంఘ సంస్కర్తలు** వంటి శూరుల భుజ స్కంధాలపైన ఉన్నది. అజ్ఞానం అనేది చదువుకొన్న వారిలో ఉండదనీ, చదువులేని వారిలోనే ఉంటుందని భావించటానికి లేదు. బౌతిక సంపద, భౌద్ధిక విజ్ఞానం వలన ఈ అభావం, అజ్ఞానం దూరమవుతాయని అనుకోవటం తెలివి తక్కువ. ఎందుకంటే ఇవి కేవలం నైతిక సంపదలకు సంబంధించినవి.

**కథ 29 : ఒ**క విద్వాంసుడైన గృహస్థు చక్కెరతో చేసిన మూడు సాధువుల బొమ్మలు తెచ్చి ఇంట్లో ఉంచగానే సరిగ్గా అదే సమయానికి ముగ్గురు సాధువులు కూడా అతని ఇంటికి అతిథ్యానికై రావటం జరిగింది. గృహస్థు వారికి భక్తితో భోజనానికి ఏర్పాట్లు చేస్తూఉండగా, అతని చిన్న కుమారుడు లోపలి గదిలో తండ్రికి బొమ్మలను చూపి, నాన్నా వీరెవ్వరని ప్రశ్నించాడు. "సాధువులు నాయనా" అన్నాడు. వీరిని యేమి చేద్దాం ? అని కుమారుడు ప్రశ్నించగా 'తినివేద్దాం' అని తండ్రి బదులు పలికాడు. గృహస్థు పంచదార బొమ్మల గురించి చెప్పిన ఈ మాటలు బయట కూర్చొన్న సాధువులకు వారిని గురించి పల్కినట్లుగా అవగతమయింది. గృహస్థు తమను చంపబోతున్న హంతకుడని భావించి సిద్ధాన్నాన్ని వదలుకొని భయంతో అక్కడనుండి పారిపోతారు. అజ్ఞానం మాట్లాడేటపుడు పాటించవలసిన ఔచిత్యం వీటి మధ్య జరిగే సంఘర్షణ వ్యక్తిని ఈ విధంగా ప్రభావితుణ్ణి చేస్తూ, వాస్తవం ఒకటైతే జరిగేది వేరొకటిగా తారుమారవుతూ వుంటుంది.

**కథ 30 : ఒ**కానొకప్పుడు ఒక అడవి నిండా గాడిదలే నివసిస్తూ కడుపు నిండా తిని స్వేచ్ఛగా జీవించేవి. ఇది చూచి ఒక నక్క సహించలేక గొప్ప విపత్తు ముంచుకొస్తూందని తెలిపి, తనకు దుఃఖం ఆగట్లేదని, మీరందరూ ఇంత ఆనందంగా ఎలా ఉన్నారని గాడిదలను ప్రశ్నిస్తుంది. ఒక పెద్ద చేపల సమూహం దండెత్తి గాడిదల మీదకు వస్తున్నదనీ భయపెట్టడంతో ప్రాణభీతితో గాడిదలు గ్రామంవైపు పారిపోతాయి. గ్రామంలో ప్రవేశించిన గాడిదలకు చాకలివాళ్ళు ఆశ్రయమిచ్చి, భయం లేదని చేపల సంగతి తాము చూసుకొంటామని హామీ ఇచ్చి వాటి మెడకు తాడుకట్టి బంధిస్తూ ఈ రోజునుండి మా బరువులు మోయండని ఆజ్ఞాపిస్తారు.

అజ్ఞానం వల్ల, భ్రాంతులవల్ల ఈనాడు ప్రజలు గాడిదల కంటే హీనంగా చిక్కులో పడుతున్నారు. మూఢ విశ్వాసాలతో పరావలంబులైబ్రతకటానికే ఎక్కువ ఇష్టపడుతున్నారు.

**కథ 31 : ప**ర్వతారోహణ పేరుతో తిరుగుతూ ఒక వ్యక్తి ఒక అజ్ఞాత ఘూర్ వద్దకు చేరుకొన్నాడు. ఒక రాజు యొక్క అవినీతికరమైన చర్య కారణంగా అనేక మంది అంధులు అక్కడ నివసిస్తూ ఇతడికి కనిపించారు. ఆ ప్రాంతంలోని నీటిలోను, మట్టిలోను ఖనిజ తత్వాలు లోపించటం వలన అందరూ క్రమంగా చూపుకోల్పోయి అంధులుగా మారినట్లు అతడు తెలిసికొంటాడు. అంతేగాక ప్రకృతియొక్క మరియే ఇతర ఘటనా క్రమం గురించి జ్ఞానం లేకపోవటం వలన అంధులకీ స్థితి యేర్పడిందని ప్రతీ గ్రామం తమవరకే పరిమితమై ఉంటే మీరు ఇంతటి విశాల భూఖండంలో ఉండికూడా అజ్ఞానంతో అజ్ఞాతంగా

**సుఖపడలేకపోవడానికి కారణం - ఉన్నదానిపై నిర్లక్ష్యం, లేనిదానికోసం ఆరాటం.**

జీవిస్తున్నారని గుర్తిస్తాడు. వారికి లోకం గురించి, ప్రకృతి గురించి, దృష్టియొక్క శక్తి గురించి అవగతం చేస్తూ వారికి ప్రేరణను కల్పించాలని భావించి ఎంతగానో ప్రయత్నించి విఫలమవుతాడు. అతనిని పనికిరాని మూర్ఖుడుగా వారు భావించి అతడికి హితవు చెపుతూ, ఈ వ్యర్థపు కబుర్లు మాని, గ్రామానికి పోయి ఒక అమ్మాయిని వివాహం చేసుకొని సుఖంగా ఉండమని సలహా ఇస్తారు. అంతిమ దినాన అతడు ప్రదేశాన్ని వదలి పోవుటకు నిశ్చయించుకొని పర్వతం మీదికి ప్రాతఃకాలమే యెక్కి సూర్యోదయం కోసం నిరీక్షిస్తూ ఉండగా క్రిందనున్న అంధుల ప్రపంచం నల్లని అజ్ఞానం అనే చీకటిలో కూరుకుపోయిన ప్రదేశంగా అతడికి కనిపించింది. వీరిలో పేరుకొన్న అజ్ఞానాంధకారాన్ని ఎదుర్కోవటానికి ఒక విస్తృతమైన ప్రణాళికను తయారుచేసికొని వచ్చి వీరి జ్ఞాన నేత్రాలు తెరిపించాలని నిర్ణయం చేసికొని అక్కడనుండి బయలుదేరుతాడు.

నేటి ప్రపంచం కూడా ఈ అంధుల నివాస స్థానంలాగే ఉన్నది. భయం, అవివేకంతో కూడిన ఆలోచనలు, ఆచరణలు, వీటితో ఎవ్వరికి ఇష్టం వచ్చినట్లు వారే నిర్ణయించుకొన్న విలువలు, సాంప్రదాయాలతో నిండిఉన్న ప్రపంచం ఇది.

**కథ 32 : ఒ**కసారి యమధర్మరాజు మృత్యుదేవతను పిలిచి ఒక ప్రత్యేకమైన ప్రదేశం నుండి వెంటనే వేయిమంది మనుష్యులను చంపి తీసుకొని రమ్మని ఆజ్ఞాపిస్తాడు. యముని ఆదేశాన్ని మృత్యుదేవత తక్షణం అమలు పరచే నిమిత్తం ప్లేగు, కలరా వంటి దూతలను కొంతమందిని పిలిచి ఆ ప్రదేశానికి పంపించింది. ఈ దూతలు వారి పనిని వారు సమర్థవంతంగా తక్షణమే అమలుపరచి రెండువేల మంది మృతులను యమధర్మరాజు ముందు హాజరు పరచేరు. తన ఆజ్ఞను తక్షణం అమలు పరచినందులకు యముడు ఆనందించి వెయ్యిమందికి బదులు రెండు వేలమంది ప్రాణాలను ఎందుకు హరించినట్లని కోపంతో ప్రశ్నించాడు. దానికి దూతలు వినమ్రతతో, "యమధర్మరాజా! నీ ఆజ్ఞ మేరకు మేము చంపినది నిక్కచ్చిగా వేయిమంది మనుష్యులనే. మిగిలిన వేయిమంది మరణించిన వారిని చూచి భయంతో తమంత తామే ప్రాణాలు వదలిన వారని బదులు పలికారు.

**కథ 33 : న**రేంద్రుడొక చెట్టుమీద మిత్రులతో కలసి ఆటలాడుతూండగా ఆ దారివెంట వెళ్ళే ఒకాయన పిల్లలు చెట్టునుండి పడి గాయాలు తగిలించు కొంటారని కలతచెంది క్రిందకు దించటానికి ఎంతగానో ప్రయత్నించి విఫలుడై, "నాయనలారా! ఈ చెట్టుమీద ఒక భూతం ఉన్నది. మీరిలా అల్లరి చేస్తే ఆ భూతం కోపించి మిమ్ములను మింగివేస్తుంది అని హెచ్చరించి ముందుకు సాగిపోతాడు. ఆ మాటలకు నరేంద్రుని మిత్రులంతా భయపడి పారిపోయినా, నరేంద్రుడొక్కడే సాహసంతో ఒంటరిగా నిలబడి భూతాన్ని ఎదుర్కొంటానని సవాలు చేస్తాడు. రాత్రంతా ఒంటరిగా భూతం రాక కోసం ఎదురుచూచిన ఈ బాలుని సాహసం, దృఢత్వమే అతడిని వివేకానందునిగా కీర్తిమంతుని చేయడమేగాక, భరతమాతను కూడా ధన్యురాల్ని చేశాయి.

ఆత్మబలం, ఆత్మ వివేకం జాగృతమైనప్పుడు అవినీతి వల్లనే అవాంఛనీయతను కూడా చాలా సరళంగా ఎదుర్కోగల్గుతాం. ఈశ్వరచంద్ర విద్యాసాగరుని పేరు ఇటువంటి సందర్భాలలో పేర్కొనదగినది. వీరు జీవిత మంతా అజ్ఞానాంధకారంలో చొచ్చుకొని పోతూ కాంతికిరణాలను దశదిశలా వెదజల్లటానికి శ్రమించడం జరిగింది. అజ్ఞానాంధకారాన్ని నివారించటానికే నలుదిశలా వ్యాపించిన మూఢ విశ్వాసాలకు విరుద్ధంగా పోరాడి, స్త్రీ తన కాళ్ళమీద తాను నిలబడటానికి, వితంతు వివాహాలను ప్రోత్సహించటానికి, ఆందోళనసలిపి, అపారమైన కృషిచేసిన మహనీయుడు.

**సేవకు స్ఫటిక రూపం త్యాగం. నీవు ధ్యానంలో ఉన్నాసరే. నీ సాయంకోరి ఎవరైన వస్తే తక్షణం వెళ్ళి సేవ చేయ్యి.**

రాజారామ్ మోహన్‌రాయ్ జీవితమంతా ఇదే కృషితో అనవరతము కొట్టుకొనిపోతూ, సతీసహగమనం వంటి కురీతియుక్త పరిస్థితులను సాహసోపేతంగా ప్రతిఘటించడం జరిగింది. పోరాటంలో ఒక వైపు పూర్తి సమాజం ఉన్నప్పటికి, రెండవవైపు వారు వంటరిగా నిలబడినా, విజయలక్ష్మి వారినే వరించింది. అవాంఛనీయతలను నిర్మూలించటం కోసం సమాజోద్దరణ యొక్క దిశాధారలను నవ నిర్మాణం చేయటం కోసం ఇటువంటి మహానీయులు జరిపిన కృషి అపూర్వం, చిరస్మరణీయం.

శ్లో॥ **భ్రష్టతా చింతనస్యాథ దుష్టత్వా చరణస్యచ ।**
**మాన్యతా మోహరూపాస్త అంధాశ్చపి పరంపరాః ॥**
**దుష్ట వృత్తస్య ఏతాస్తు జ్ఞాయతాం హే మునీశ్వరాః ॥**
**ఆక్రామకాత్వనీతిర్యా సేవం తాస్తు భయంకరాః ॥**

భ్రష్టచింతనలు, దుష్టాచరణలు, మూఢాచారాలు, అంధ విశ్వాసాలు అవినీతికంటే కూడ భయంకరమైనవి. పుట్టినది ఎక్కడైనా స్వల్పకాలంలో సర్వత్రా వ్యాపించి, వినాశనాన్ని కల్గిస్తాయి. ఆక్రమణకారుల ఆకృతిగల జీవులైనట్లయితే వారిని పట్టి బంధించి శిక్షించవచ్చు. కానీ ఆకృతి లేని ఈ దుష్ప్రవృత్తులు మానవుల స్వభావాలలో ఉండి చర్మ చక్షువులకు కనిపించక ఎంతటి దారుణమైన తిరుగుబాటుకీ లొంగక రక్షింపబడుతూ పరోక్షంగా హద్దులేని హానిని కల్గిస్తూ ఉంటాయి. ఇవి సమాజ సౌధాలను నెమ్మదిగా చెదలు తిన్నట్లు తినివేసి హఠాత్తుగా కూలదోస్తాయి. పైకి సమాజం వృద్ధి చెందుతున్నట్లే కంటికి కనిపించినా ఈ దుష్ప్రవృత్తులు పరోక్షంగా సమాజాన్ని నైతికంగాను, ఆర్థికంగానూ కూడా దిగజారుస్తాయి.

ఘోషా పద్ధతి, వరకట్నం, మాదక ద్రవ్యాలు, దుబారా ఖర్చు, లంచగొండితనం, విశ్వాస ఘాతుకం, స్త్రీలపై అత్యాచారాలు వంటివి కేవలం వ్యక్తిగత దురాచారాలుగా భావించి, ఉపేక్షించటానికి ఎంత మాత్రం వీల్లేదు. ఇవి వ్యక్తినుండి కుటుంబానికి, కుటుంబం నుండి సమాజానికి పాకి ప్రత్యక్షంగానూ ఇంకా అనేక విధాలుగా పరోక్షంగాను సర్వనాశనం కల్గిస్తాయి. కాబట్టి ప్రత్యక్షంగా కలుగుతున్న అవరోధాలను అరికట్టటానికి ఏ స్థాయిలో సంఘర్షణ జరుపుతున్నామో, అంతకంటె హెచ్చు స్థాయిలోనే ఈ పరోక్ష శత్రువులతోగూడ పోరాడటం అవసరం, అనివార్యం కూడా.

**కథ 34 : ఒ**కసారి ఒక ఇంట్లో శుభకార్యం జరుగుతూండగా పెంపుడు పిల్లి భోజన పదార్థాలన్నిటినీ పాడుచేయసాగింది. ఇంటి యజమానురాలు పిల్లిని పట్టుకొని దూరంగా ఒక గదిలో బంధించి వచ్చింది. వివాహ శుభకార్యం ముగిసాక యజమానురాలు పిల్లిని గూర్చిన ఆలోచన వచ్చి వెళ్ళి చూడగా అది మరణించింది. ఆమె దుఃఖించి ఆ పిల్లిని యధావిధిగా దహనం చేసింది. ఇదంతా చూచిన క్రొత్త కోడలు ఇది ఆ ఇంటి ఆచారంగా భావించి తరువాత ఆమె కుమారుని పెండ్లికి కూడా పిల్లిని తెచ్చి బంధించి, నాల్గురోజుల తర్వాత క్రొత్త కోడలు రాగానే పిల్లి వద్దకు వెళ్ళి, మరణించిన దానినితెచ్చి దహనం చేసింది. ఆమె కోడలు కూడా ఇదే ఆచారాన్ని పాటించింది. ఈనాడు ఎక్కడ చూచినా ఇటువంటి అంధ విశ్వాసాలే సమాజంలో వ్యాపించి ఉన్నాయి. వాటి వెనుక గల అంతరార్థాన్ని తెలుసుకోటానికి కనీసం ప్రయత్నించకుండా అంధానుకరణ చేయటం శోచనీయం, అత్యంత దురదృష్టకరం కూడా.

**కథ 35 : ఒ**క రాజ్యంలో ఒక నిర్జన ప్రదేశంలో సైనికుడు ఒకడు 24 గంటలు వహారా కాస్తూ ఉండటం చూచి, ఆశ్చర్యంతో ఒక సన్యాసి దీనికి కారణం ఏమిటని రాజువద్దకు వెళ్ళి ప్రశ్నిస్తాడు. రాజుకూడా

ఆశ్చర్యపడి కారణం తెలియక మంత్రిని పిలచి అడుగుతాడు. మంత్రి సేనాపతిని, సేనాపతి కొత్వాల్‌ని, కొత్వాల్ చివరకు వహారా కాస్తున్న వ్యక్తి వద్దకే వెళ్ళి కారణం చెప్పమంటాడు. చివరకు పరిశీలనలో తేలిన విషయం ఏమంటే 80 సంవత్సరాల క్రితం ప్రస్తుతం ఉన్న రాజుకు 3 తరాల వెనుక వారి వంశంలోని ఒక రాజకుమార్తె ఆ ప్రదేశంలో స్పృహ తప్పి పడిపోయింది. అప్పటి నుండీ ఆ ప్రాంతాన్ని కీడైన ప్రదేశంగా భావించి అటువైపు రాజకుటుంబంలోని వారు ఎవ్వరూ పోకుండా చూస్తూ ఉండమని ఒక కాపలాదారుని నియమించటం జరిగింది. కాబట్టి 3 తరాలుగా వహరాదార్లు మారుతూ ఈ విధంగా నిరంతరం కాపలా కాస్తున్నట్లు విషయం వెల్లడి అయింది. ఈ అవివేక పూరితమైన రివాజును వెంటనే బందు చేయటం జరిగింది. తమ పూర్వీకుల అవివేకానికి రాజు తన పశ్చాత్తాపాన్ని వ్యక్తంచేస్తూ సన్యాసికి కృతజ్ఞతలు తెలుపు కొంటాడు. ఈనాడు సమాజంలో ఇటువంటి రీతి, రివాజులు అనేకం ఉన్నాయి. వాటిగురించి తెలుసుకోవాలని ప్రయత్నించనంతకాలం అవి నిరాటంకంగా కొనసాగుతూనే ఉంటాయి.

**కథ 36 : ఒ**క పండితుడు పూజా సమయంలో గంట మ్రోగించగానే ప్రక్కింట్లో గాడిద ఓండ్రపెట్టి అరిచేది కొంత కాలానికి గాడిద మరణించింది. ఆ వార్త వినిపండితుడు బాధపడి దాని జ్ఞాపకార్థం తలనీలాలు సమర్పించి వస్తాడు. సరకుల నిమిత్తం దుకాణానికి వెళ్ళిన పండితుని చూచి షాహుకారు తలనీలాలు ఏవి స్వామీ? అని ప్రశ్నిస్తాడు. శంఖరాజు భౌతికలీల సమాప్తమైందయ్యా! అని పండితుడు బాధగా బదులు పల్కుతాడు. షాహుకారు కూడా వెంటనేవెళ్ళి గుండు చేయించుకొని స్నానంచేసి వస్తాడు. ఈవార్త ఈ విధంగా ఒక్కొరొక్కరికే ప్రాకి చివరకు రాజు వరకు చేరింది. తలనీలాలు తానుకూడా సమర్పించాలా! వద్దా ? అని రాజు క్షణం ఆలోచించి ఎందుకైనా మంచిది వెళ్ళి పండితులవార్ని తీసుకొని రమ్మని పంపిస్తాడు. పండితుని ద్వారా విషయం విని ప్రజల మూర్ఖత్వానికి రాజు విచారిస్తాడు. ఊరు ఊరంతా సిగ్గుతో తలలు దించుకొంటారు.

**కథ 37 : మ**నలో అధికశాతం ప్రజలు అజ్ఞానం వల్ల అంధానుకరణ చేయటమో, లేక అహంభావంతో తెచ్చి పెట్టుకొన్నఆడంబరాన్ని ప్రదర్శించటమో చేస్తూ ఉంటారు. అజ్ఞానులు వీటిని చూచి నిజం అని నమ్మి మోసపోతుంటే, కొద్దిమంది వివేకవంతులు వాస్తవాన్ని వెలుగులోనికి తేవటానికి కృషి సల్పుతూ ఉంటారు.

ఒక కోతి ఒక నక్క చాలా మైత్రితో జీవించేవి. ఒకనాడు ఈ రెండు వన విహారానికి బయలుదేరగా దారిలో కొన్ని సమాధులు కనిపిస్తాయి. ఒక సమాధివద్ద కోతి నిలబడి స్తోత్రాలు మొదలుపెట్టి తన భక్తిని, విద్వత్తుని నక్క చూస్తోందా లేదా అని మధ్య మధ్య గమనించ సాగింది. కాని నక్క కోతి కపటపు భక్తి ప్రదర్శనను కనిపెట్టి, “ఏమి మిత్రమా! అక్కడే ఆగిపోయి ఏదో గొణుగుతున్నావ్? కడుపులో నొప్పిగాని లేచిందా?” అంటూ ప్రశ్నించింది.

కోతి బాధను కోపాన్ని దిగమింగుతూ, “అరే నీకు తెలియదా మిత్రమా! ఈ సమాధి మా తాతగారిది. వారి జ్ఞానాన్ని కళాకౌశలాన్ని కీర్తిస్తూ నేనుకూడా వారంతటి భక్తితత్పురుడను కావాలని ప్రార్థన చేస్తున్నాను అంటూ సమాధానం చెప్పింది.

నక్క నవ్వి, కోతలు కోయ్! దానికే ముందిలే, నీవు చెప్పేవి నిజమో అబద్దమో సాక్ష్యం చెప్పటాన్కి మీ తాత ఇక్కడ లేడు కదా! నీ ఇష్టం. ఎన్నయినా చెప్తావ్! కానీ విని నమ్మటానికి నేను మూర్ఖురాలిని కాదు అంటూ ముందుకు సాగిపోయింది. కోతి తన నటనకు సిగ్గుపడక తప్పలేదు.

**సైన్సు ఇచ్చే జ్ఞానాన్నీ, శక్తినీ వాడుకునే బుద్ధి, వివేకం, సైన్సునుండి దొరకవు.**

**కథ 38 : "జాతిబేధం"** అనే దురాచారాన్ని గురించి చెబుతూ స్వామి రామతీర్థుడు శిష్యులతో "నాయనలారా! జాతిబేధాలు ఈనాడు ఉన్నట్లే ఇక ముందుకూడా కొనసాగితే దేశం పూర్తిగా బలహీనమై సర్వనాశనమవుతుంది. కేవలం ఈ దురాచారం ఒక్కటి చాలు. భారతదేశ ఐకమత్యాన్ని నాశనం చేసి పతనం వైపు లాక్కొని పోవడంలో ప్రధాన పాత్ర వహిస్తోంది. ఇటువంటి తరుణంలో మన లక్ష్యం ఏమిటంటే అందరకు సమాన న్యాయం గౌరవం లభించగల నవసమాజ నిర్మాణం" అని గట్టిగ స్పష్టంగా తెలియ జేశారు.

**కథ 39 : అ**మరదాస్ అనే ఆయన సిక్కు సంప్రదాయంలో మూడవ గురువు. సమాజంలో ఉచ్ఛనీచాలు, గొప్ప-బీద వంటి అనేక బేధభావాలు అత్యంత వికృత రూపం దాల్చి తాండవం చేసే రోజులలో ఆయన తన అనుయాయులకు సామూహిక భోజనాల పద్ధతిని ప్రవేశపెట్టాడు. మనుషులు మనుషులు మధ్య బేధభావాలను అంతం చేయటానికి ఈ సామూహిక భోజనాల పద్ధతి ఎంతగానో తోడ్పడింది.

ఈయన సాహసానికి ప్రతిభకు ముగ్ధుడై అక్బరు ఒకనాడు దర్శనానికి రాగా, అమరదాస్ ఆయనకు ఒక సందేశం పంపుతూ చక్రవర్తిలాగ కాక ఒక సాధారణ పౌరుడిగా రాగల్గితే నీకు దర్శనం ఇవ్వటానికి నాకేమీ అభ్యంతరం లేదని తెలియజేస్తాడు. అక్బరు అంగీకరిస్తాడు.

ఒకే భగవానుని బిడ్డలైన మానవులంతా సోదరులే. కాబట్టి తరతమ బేధాలు మరచి ఆశ్రమవాసులతో కలసి భోజనం చేసి వెళ్ళమంటాడు. అక్బరు ఆయన మాటను శిరసావహించి ఆయన కృపకు పాత్రుడవుతాడు.

**శ్లో॥ ఏకం క్షేత్రం చింతనస్య వ్యక్తి గస్యమతం తథా ।**
**స్వభావా చరణాభ్యాస సమ్మానా నాంచ విద్యతే ॥**
**పశువృత్తేః సంచితా యే కుసంస్కారాస్త ఏషుహి ।**
**క్షేత్రేషు దృఢమూలాశ్చ స్థితాః సూక్ష్మక్షికా బలాత్ ॥**

**ఒ**కే క్షేత్రం వ్యక్తిగత చింతినలకు గౌరవ శీల స్వభావాలకు ఆధారమై ఉంటుంది. కానీ పశు ప్రవృత్తుల ద్వారా ఆర్జించుకొన్న కుసుంస్కారాల వ్రేళ్ళు ఈ క్షేత్రంలో బలంగా తిష్ఠ వేసుకొని పెకలించ లేనంత గట్టిగా నాటబడి ఉంటాయి. అయినా హానికరమైన వీటిని ఉపేక్షించక ఏదోవిధంగా పెకలించి నాశనం చేయాలి. వీటికి ప్రత్యర్థులైన సుసంస్కార బీజాలను ఈ క్షేత్రంలో వెదజల్లుటయే ప్రగతిశీల ధర్మనిష్ఠకు ప్రథమ చరణం. తమ అంతరంగాన్ని ఎవరైతే జయించగలరో వారు మాత్రమే బాహ్య ప్రపంచాన్ని కూడా జయించ గల్గుతారు. తనను తాను గెలవనిదే ఇతరులనుగానీ, లోకాన్నిగానీ గెలవటం సాధ్యంకాదు.

**'సంగ్రామం' అనేది ముందు మనలోనే ప్రారంభం కావాలి.** మన ఆలోచనలతోను మన దుష్ప్రవృత్తులతోను పోరాడి గెలవాలి. వ్యక్తికి తనమీద తనకు కాఠిన్యం, ఆలోచనా పరిష్కారం ఈ రెండు బాహ్య జగత్తులో పనిచేయటానికి కావలసిన ఆత్మ శక్తిని కలుగజేస్తాయి.

**కథ 40 : త**ల్లి ఎంత చెప్పినా వినక, తీపి మిఠాయిలు తింటూ ఆరోగ్యం పాడుచేసుకొన్న బిడ్డను రామకృష్ణ పరమహంస వద్దకు తీసుకొని వచ్చి తీపి తినవద్దని నచ్చచెప్పమని కోరగా పరమహంస ఆలోచించి ఆమాట చెప్పటానికి ఒక వారం రోజుల తరువాత బిడ్డను తీసుకొని రమ్మని చెప్పి పింపివేస్తాడు.

వారం గడచిన తరువాత తాను చెప్పిన ప్రకారం పరమహంస ఆ బిడ్డకు తీసి తినవద్దని బోధ

చేస్తాడు. ఈ మాత్రానికి వారం రోజులు గడువు దేనికని ప్రశ్నించగా పరమహంస నవ్వి, "నేను ఇతరులకు చెప్పటానికి ముందు ఆ పని నేను మానాలికదా! తీపి మిఠాయిలు తినే నా అలవాటు మానుకోవటానికి నాకు వారం రోజులు గడువు అవసరమైంది. **ఆచరణ లేని ఉపదేశాలు ఫలించవు**" అని బదులు పల్కుతాడు. లోకసేవకుల ప్రథమ కర్తవ్యం "ముందుగా తమ ఆలోచనలు, అలవాట్లు మార్చుకోవటం" అనే విషయాన్ని పై కథ తెలియజేస్తోంది.

**కథ 41 : ఒ**క మహత్వ కాంక్షాపరుడైన యువకుడు సమాజ సేవ చేస్తానని దీక్షపూని తన సంఘసంస్కరణ ప్రణాళికను సంత్ తిరువళ్వారుకు తెలియబరచి దానిపై ఆయనయొక్క అభిప్రాయాన్ని తెలుపమని కోరుతాడు. యువకుడు చెప్పినదంతా విని తిరువళ్వారు అతని భుజంపై చేయవేసి "నాయనా! ఇప్పుడు నీవు చెప్పిన వన్నీ ముందు నీ జీవితంలో అమలు పరచటం అనివార్యం. **లోక సేవకుల ప్రథమ కర్తవ్యం వారి వారి శీలస్వభావాలను పవిత్రం చేసుకొని, ఆలోచనలను సంస్కరింప చేసికోవటం. ఆ తరువాతనే లోక సేవకుడుగా రాణించి సమాజానికి న్యాయం చేకూర్చ గల్గుతాడు**" అని చెప్పి సత్యాన్ని ఎఱుక పరుస్తాడు.

**కథ 42 : లో**క సేవకులను సంబోధిస్తూ వివేకానందుడిచ్చే సందేశాలు ఎలా ఉండేవంటే; "సోదరులారా! కుసంస్కారాల పరిత్యాగం వల్ల మాత్రమే వ్యక్తి పరిపక్వత నొందుతాడు. ఆలోచనలలో ప్రౌడత, దృష్టికోణం యొక్క పరిపక్వత వీటివల్ల అనేక విధాలైన సాఫల్యాలను అందిపుచ్చుకోగల ఉత్కృష్టమైన వ్యక్తిత్వం లభిస్తుంది. మానవ జీవితం యొక్క విశిష్ఠత, ఉద్దేశ్యము ఇదే. కుసంస్కారాల శోధన వల్లనే వ్యక్తిత్వం ప్రౌఢ దశకు చేరుకొంటుంది. ఆలోచనలలో ప్రౌఢత్వం, దృష్టికోణంలో పరిపక్వత వీటివల్ల వ్యక్తిత్వపరంగా ప్రతిభావంతుడు కాగల్గుతాడు. గొప్ప గొప్ప విజయాలను సునాయాసంగా సాధించగల్గే పరిస్థితులు చుట్టూ ఏర్పడుతాయి".

"అల్పాయుష్షు కలవాడు, అధిక ప్రసంగాలు చేసేవాడు మాత్రమే అల్పుడని భావించనక్కరలేదు. ఆలోచనల పరంగా ఆకాంక్షలు పరిపక్వత లేకుండా ఉండి, ఈ తుచ్ఛమైన ఆకాంక్షలను నెరవేర్చుకోవటానికి అందమైన చేతి బేడీలను ధరించిన వారలను ప్రజలు తెలివిగలవాడని, చతురుడని అంటే అనవచ్చును. కానీ దివ్యత్వ దృష్టితో చూస్తే ఇటువంటి వాళ్ళు అంగవిహీనులు, అల్పులు, అజ్ఞానులు, మరుగుజ్జు మనుష్యుల స్థాయికంటే నికృష్ఠమైన వారని చెప్పక తప్పదు". అంటూ వివేకానందుడు కుసంస్కారాల పరిత్యాగానికి ఆలోచనల పరిపక్వతకు ఉన్న ప్రాధాన్యతను పదేపదే తెలియజేసేవాడు.

**కథ 43 : ప**రీక్షలనేవి అందరిలాగే సంఘసంస్కర్తలు, సన్యాసుల జీవితాలలో కూడా తప్పనిసరి అవుతూ వుంటాయి. కానీ ఇవి వారికి మేలునే కల్గిస్తాయి.

స్వామి ఆత్మానందుని కుటీరం గ్రామానికి చాలా దగ్గరగా నున్నది. ప్రతి సాయంత్రము గ్రామీణ ప్రజలు ఆయన వద్దకు వెళ్ళి ధర్మచర్చలో పాల్గొనేవారు. ప్రతిరోజు సంధ్యావందన సమయానికి ఇద్దరు అల్లరి పిల్లలు ఎక్కడినుండో వచ్చిచేరి పనికిరాని కబుర్లతో స్వామీజీకి విసుగు, కోపం తెప్పించాలని ప్రయత్నించేవారు. ఈ విధమైన ప్రవర్తన వాళ్ళకు మనోరంజకంగా ఉండేది, కానీ స్వామీజీ సంధ్యావందన సమయం కాస్త వృధాగా గడచి పోయేది. నెలల తరబడి ఈ విధంగా సాగుతున్నా స్వామీజీ ఆ పిల్లలపై కాస్త కూడా కోపించలేదు. ఎంతకీ స్వామీజీకి కోపం రాకపోయేసరికి పిల్లల మనస్సు కలత చెందింది. ఆ శాంతమూర్తి పాదాలపై వ్రాలి, మాతప్పు మన్నించమని కోరుతూ, ఇంత విసిగించినా అంత శాంతాన్ని ఎలా వహించ

**అంతరాత్మ మనల్ని మందలించే పనులు మనం చేయకూడదు.**

గలిగారని ప్రశ్నించారు. స్వామీజీ చిరునవ్వు నవ్వి, "నాయనలారా! లోకసేవకుడు తనను తాను జయించుకొని ప్రతిదీ తాను ఆలోచించిన తర్వాతనే ఇతరులకు చెప్పగల అర్హతను సంపాదిస్తాడు. మీరేదో అల్లరిచేసి తప్పుగా ప్రవర్తించారని నేను కూడా మీవలెనే మీపట్ల ప్రవర్తిస్తూ కోపం, చికాకువంటి వాటికి దాసుడనైన నాడు ఇంక నేను మీకు ఏమి బోధించగల్గుతాను? అని ఎదురు ప్రశ్న వేస్తాడు.

**కథ 44 : ఒ**క నది ఒడ్డున ఒక పండితుడుండేవాడు. ఆయన చాలా సౌమ్యుడు, కలుపుగోరు స్వభావం కలవాడు. పరిశ్రమవల్ల, నిజాయితీవల్ల ఆయన జీవితం సుఖశాంతులతో సాగుతూ ఉండేది. కానీ హఠాత్తుగా ఒక నాడీయనకు ఆత్మాన్వేషణ చేయాలనే కోర్కె కల్గింది. నెమ్మదిగా లౌకిక బాధ్యతలను పూర్తిగా విస్మరించి ఆత్మాన్వేషణా కార్యక్రమంలో లీనమయ్యాడు. దానితో ఇంటిలోని వారేపని చెప్పినా కోపంతో విసుక్కునేవాడు. రాత్రీ పగలు ఆత్మాన్వేషణ ధ్యాసే తప్ప ఇతర చింతన లేకుండా పోయింది. స్వజనుల పట్ల కాఠిన్యం, కోపం, చికాకు, బాధ వంటివన్నీ అతన్ని చుట్టుముట్టాయి. క్షణంలో స్వర్గంలాంటి జీవితం నరకంలా తయారయ్యింది. ఒకనాడు పండితుడు ధ్యానంలో మునిగి ఉండగా అంతర్వాణి పిలిచి, "ఓ పండితుడా! నీవు తప్పుడు మార్గంలో పడుతున్నావు. జీవితంలో కాఠిన్యాన్ని చూపడం కంటే తుచ్ఛమైనది మరేదీలేదు. నీలోనే స్థిరనివాసం ఏర్పరచుకొన్న ఆత్మను ఎక్కడెక్కడో వెదికి వేసారటం దేనికి ? **శాంతిమయ జీవితం గడపటం, మాధుర్యంతో ప్రవర్తించటం ఇవి ఆత్మస్వరూపుల లక్షణాలు.** ఈ రెండింటినీ కోల్పోతున్నావంటే, నీ ఆత్మాన్వేషణ వృధా అవుతున్నట్లు గమనించు. కాబట్టి తక్షణమే ఆత్మయొక్క ఈ రెండు తత్వాలను దైనందిన జీవితంలో ఆచరించు. ఆత్మను నీవు అన్వేషించనవసరం లేదు. ఆత్మయే నీ ఎట్టెదుట వచ్చి సాక్షాత్కరిస్తుంది". అని పలికిన అంతర్వాణి పల్కులు పండితుని అజ్ఞానాంధకారాన్ని దూరం చేశాయి.

**కథ 45 : "శోధన"** అంటే మనస్సును పవిత్రంగా ఉంచుకోవటం, అంతఃకరణను దుర్భావనలకు దూరంగా ఉంచటం అని అర్థం. ఈ ఏకైక లక్ష్యసాధన కొరకే అనేక మంది అనేక రకాల స్థూల సాధనలు చేస్తూ వుంటారు. కానీ పవిత్రంగా లేని అంతరంగంలో ఆచరించే బాహ్య కర్మకాండవల్ల ఫలితం శూన్యమే అవుతుంది.

కొందరు బ్రాహ్మణులు గంగానదికి స్నానానికై వచ్చి, స్నానం చెయ్యాలని ప్రయత్నించి, నీరు చాలా లోతుగా ఉండటం వల్ల భయపడి కనీసం పాత్రతో ముంచి పోసుకోవాలన్నా తమవద్ద పాత్ర లేనందుకు చింతిస్తూ ఉండగా వారి పరిస్థితికి జాలపడి, అక్కడే కొద్ది దూరంలో స్నానంచేస్తున్న కబీరుదాస్ తన వద్దనున్న పాత్రను కడిగి వారి వద్దకు పంపిస్తాడు. ఇది చూచిన బ్రాహ్మణులు నిప్పుత్రొక్కిన కోతులవలె గెంతుతూ, పెద్దగా అరుస్తూ ఆ పాత్రతో స్నానం చేయటం వలన తాము మైలపడతామని తమ అభ్యంతరాన్ని తెలియజేస్తారు. కబీరు వారివంక జాలిగా చూస్తూ, "సోదరులారా! అనేకసార్లు ఈ గంగా నదిలో కడిగి శుభ్రం చేయబడిన ఈ పాత్ర ఇంకా పవిత్రం కానప్పుడు, దుర్భావనలతో నిండిన మన మానవదేహం ఒకసారి గంగలో మునిగినంత మాత్రాన పవిత్ర మవుతుందంటారా ?" అని సూటిగా ప్రశ్నించేసరికి బ్రాహ్మణులు సిగ్గునొంది మారు మాట్లాడకుండా ఆ పాత్రను అందుకొని స్నానాలు చేస్తారు. భక్త కబీరు ఆత్మవంచన, దుష్ప్రవృత్తుల ఉన్మూలన-నీటిని గూర్చి ఒక దోహాలో ఏమన్నాడంటే -

**"బురాజో ఖోజన మై చలా బురాన దేఖా కోయి**
**జోదిల్ ఖోజా అపనా ముఝుసా బురాన కోయి"**

**అదృష్టంపై కాక శీలంపై ఆధారపడు.**

**ఆత్మచింతన వల్లనే దుష్ప్రవృత్తుల నిర్మూలన సాధ్యమవుతుంది** అనే కబీరువాణిలో ఉన్నస్థితి వాస్తవానికి అందరి స్థితీ కావాలి. కేవలం తన అంతరంగాన్ని అన్వేషించటం వల్ల మాత్రమే వ్యక్తి తనలోని చెడునంతనూ తీసిపారవేయగల్గుతాడు. ఈ ఒక్క పనిని వ్యక్తి వ్యక్తి చేయగల్గిననాడు విశ్వాన్ని ఎవరో మార్చనక్కర లేదు. అదే మారిపోతుంది.

**శ్లో॥ కుటుంబం తను రివైతత్ స్నేహస్త స్మైతుదీయతామ్ ।**
**ప్రగతేః పోషణస్యాపి సాధనాది చ దీయతామ్ ॥**
**ధ్యానముత్త తేదాయిమ్య దీయతాంతే భవంతుహి ।**
**సుయోగ్యాశ్చ సమర్థాః స్యుః సంస్కారాః స్వావలంబనః ॥**

వ్యక్తి లోభం, మోహం, అహంకారం వంటి బంధనాలనుండి ముక్తి పొందటం కోసం తన పూర్తి సామర్థ్యాన్ని వినియోగించి ప్రత్నించిన నాడు నూటికి నూరుపాళ్ళు ఆ ప్రయత్నం ఫలిస్తుంది. కాని కుటుంబ నిర్మాణాన్ని విస్మరించిన వారికి మాత్రం ఈ ప్రయత్నాలు ఫలించవు. కుటుంబం పట్ల మోహం అనేది వేరు. బాధ్యత అనేది వేరు. వ్యక్తి తన రెండు కన్నులలో ఒక కన్నుని కుటుంబాన్ని ప్రేమించటానికి, రెండవ కన్నుని కుటుంబంలోని వ్యక్తులను సంస్కరించటానికి వినియోగించాలి. కుటుంబ వ్యక్తులను సంస్కారవంతుల్ని చేయటం వ్యక్తి యొక్క ప్రధానమైన బాధ్యత. పేరుకుపోయిన చెడును స్వల్పకాలంలో తొలగించి, సంస్కరించటం అతి కష్టతరమైనది. అంతమాత్రాన వ్యక్తి కుటుంబ సంస్కర్తగా తన ప్రథమ కర్తవ్యాన్ని ఉపేక్షించటానికి వీలులేదు. అనవరతము అప్రమత్తంగా ఉంటూ కేవలం బీజారోపణ మాత్రమే చేసి అద్భుతమైన ఫలాలు లభించటం లేదని బాధ పడకుండా, చమత్కారాలను కాంక్షించకుండా కుటుంబ సంస్కరణ కార్యక్రమాన్ని ఓర్పుతో, సామర్థ్యంతో స్వీకరించాలి. ఓ మునీశ్వరా! కుటుంబ సంస్కర్తగా వ్యక్తి చూపవలసినది వినమ్రత, సౌహార్థము అని పలికి మహర్షి ఈ క్రింది కథను వినిపిస్తాడు.

**కథ 46 : పి**ల్లలను ఎలా పెంచితే బాగుంటుందని మనము ఆశిస్తామో ఆ విధంగా మనం, మన ఆచరణలు ముందుగా మారాలి.

ఒక వ్యక్తి వృద్ధుడైన తన తండ్రిని తిరస్కారభావంతో చూస్తూ ఒక మట్టిపాత్రలో అన్నం పెడుతూ ఉండేవాడు. ఐదారు సంవత్సరాలు గల అతని కుమారుడు రోజూ ఇదంతా చూస్తూ ఉండేవాడు. చూడడమే గాక విరిగిపోయిన అటువంటి మట్టిపాత్రలు ఎక్కడ కన్పించినా తీసి తన తండ్రికోసం భద్రపరచేవాడు. పసివాడి ఈ ప్రవర్తనను గమనించి తండ్రి ఆశ్చర్యంతో ఇవన్నీ దేనికి దాస్తున్నావని ప్రశ్నిస్తాడు. "తాతయ్య వలెనే అమ్మా, నీవు కూడా ముసలివారయినపుడు మీకు భోజనం పెట్టడంకోసం ఇవి అవసరం పడతాయని జాగ్రత్త చేస్తున్నానంటూ పిల్లవాడు అమాయకంగా పలికిన పల్కులు తండ్రి కన్నులు తెరిపిస్తాయి. తన తప్పు తెలుసుకొని ఆనాటి నుండి తండ్రిని గౌరవంగా చూడనారంభిస్తాడు. తమను ఆశ్రయించుకొకున్నవారి పట్ల వృద్ధుల పట్ల నిర్దయతోను, అగౌరవంతోను వ్యవహరించే వ్యక్తులు వీరిని అనవసరంగా పోషిస్తున్నట్లు భావించేవారు వారిపట్ల దుర్మార్గంగా ప్రవర్తించేవారు విధిగా వారివారి అంత్యకాలంలో అతి దుఃఖకరమైన పరిస్థితులను అనుభవించక తప్పదు.

మోహంవల్ల అనేకమంది తల్లిదండ్రులు పిల్లల మాటలు ఉచితమో, అనుచితమో అని చూడకుండా అంగీకరిస్తూ, సమర్థిస్తూ ఉంటారు. ఇలా చేయడం వల్ల నిజానికి పిల్లలకు జరిగేది కీడేగాని మేలుగాదు.

**తన దోషాలను గుర్తించకపోవటాన్ని మించిన పొరపాటు లేదు.**

అనుచితమైన కోర్కెలు తీర్చడం గానీ, అనుచితమైన మాటలకు విలువ నీయడంగాని ఏ మాత్రం అవసరంలేదు. పిల్లలలో ఇతరులకంటే అన్నివిధాల గొప్పవాడిని అనే భావం ఉద్భవించకుండా చూడవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**కథ 47 :** పశుప్రవృత్తులను దూరం చేయడానికి, తరచుగా సత్పరామర్శ చేయటం అవసరం. ఎవరి కర్మ వారిదే – చెప్పినా వినరు – వ్యక్తులను మార్చడం మనవల్ల కాదు అనే అభిప్రాయం చాలా పొరపాటు. ఎటువంటి వారినైనా సత్పరామర్శ మార్చివేయగలదు.

ఒక రాజకుమారుడు మితిమీరిన అత్యాచారాలు చేస్తూ తండ్రి మాటలను పెడచెవిన పెట్టేవాడు. ఒకనాడు స్వయంగా బుద్ధభగవానుడు ఆ రాజ్యానికి వచ్చి, పరిస్థితిని తెలిసికొని రాజకుమారుని వద్దకు వెళ్ళి అతడిని వెంట పెట్టుకొని ఒక నిమ్మచెట్టు వద్దకు తీసికొని వెళ్ళి, "నాయనా! ఒక ఆకుకోసి నమలి, రుచి ఎలా ఉందో చెప్పు" అని అడుగుతాడు. రాజకుమారుడు నమలిన ఆకునుఉమ్మితూ ఛీ నోరంతా చేదయిపోయింది" అంటూ కోపంతో చెట్టు మొత్తాన్ని వేళ్ళతో సహా పెకలించి విసరివేస్తాడు. ఎందుకిలా చేశావని బుద్ధుడు ప్రశ్నించగా ఇంత చిన్న చెట్టే ఇంత చేదుగా ఉన్నప్పుడు బాగా పెరగనిస్తే తోటలో ఒక విష వృక్షంగా తయారవుతుంది. కాబట్టి ప్రారంభంలోనే దీన్ని నాశనం చేశాను అని రాజకుమారుడు బుద్ధునితో పల్కుతాడు. దానికి బుద్ధుడు గంభీర స్వరంతో, "నాయనా! నీ కటు ప్రవర్తనకు అసహ్యించుకొంటున్న ప్రజలు కూడా ఇదే విధంగా నీపట్ల ప్రవర్తిస్తే నీగతి ఏమవుతుందో ఒకసారి ఆలోచించు. వ్యక్తి పుష్పించి, ఫలాలనందించే మొక్కగా మారాలంటే ఉదారుడై, లోకప్రియుడై దయతో జీవించాలి" అని పల్కుతాడు. పవిత్రమూర్తియైన బుద్ధభగవానుని ఆ సత్‌పరామర్శ రాజకుమారుని జీవితాన్ని మార్చివేసింది. వెంటనే అతడు తన చెడు మార్గాన్ని వదలి సన్మార్గాన్ని స్వీకరిస్తాడు.

**కథ 48 :** ఒక తండ్రి, కుమారుడు కలసి అనేకమైన కళాకృతులను తయారుచేసి అంగడిలో అమ్ముకొని జీవయాత్ర సాగించేవారు. తండ్రి తయారుచేసిన బొమ్మలకు అధిక ధర, కొడుకు తయారు చేసిన బొమ్మలకు స్వల్పధర లభించేది. అందువల్ల తండ్రి ప్రతిరోజు అంగడి నుండి రాగానే కొడుకును దగ్గర కూర్చో పెట్టుకొని కొడుకు బొమ్మలలో ఉండే లోటుపాట్లను తెలియజెప్పి సరిదిద్దేవాడు. మర్నాడు ఆ తప్పులు బొమ్మల తయారీలో జరగకుండా కుమారుడు జాగ్రత్త తీసుకోనేవాడు. ఇలా సంవత్సరాలు గడిచాయి. తండ్రి సలహాలను తు.చ. తప్పకుండా పాటించటంవల్ల కుమారుని బొమ్మలకు కూడా అంగడిలో తండ్రి బొమ్మలతో సమాన ధర లభించసాగింది. కానీ తండ్రి ఊరుకోక యధాప్రకారంగా అంగడినుండి రాగానే కుమారుని బొమ్మల తయారీలో జరుగుతున్న లోటుపాట్లు సరిదిద్దేవాడు. తండ్రి సలహాను కొడుకు శ్రద్ధగా పాటించేవాడు. క్రమగా కొడుకు బొమ్మలకు తండ్రి బొమ్మలకంటే కూడా అధికధర లభించసాగింది. అయినా తండ్రి ఎప్పటివలనే కుమారుని పొరపాట్లు ఎత్తిచూపుతూ వాటిని సరిదిద్దేవాడు. కుమారుడు ఒకనాడు ఆశ్చర్యంతో, "నాన్నా! నా బొమ్మలకు నీ బొమ్మలకంటే రెట్టింపు ధర లభిస్తున్నా నీవు తప్పులు పట్టటం మానవెందుకు?" అని ప్రశ్నించేడు.

తండ్రి వాత్సల్యంతో కుమారుని భుజంమీద చేయివేసి, నాయనా! ఎంతటి గొప్ప కళాకారుడైనా తన పొరపాట్లను అంగీకరించి సరిదిద్దుకొంటూ ఉన్నంతవరకే **"ప్రగతి"** ఆగిపోకుండా ఉంటుంది. నీ వయసులో నాకు నా కళపట్ల చాలా అహంకారం ఉండేది. నన్ను మించిన వాడు లేడనీ, నా కళలో పొరపాటు అనేది ఉండదనీ భావించేవాడిని. కాబట్టి నా విద్య మధ్యలోనే ఆగిపోయింది. నీకు ఆ పరిస్థితి

రాకూడదని నా ఆకాంక్ష అని తెలియ జేస్తాడు.

**కథ 49 : క**పిల మహర్షి ప్రతినిత్యం గంగా స్నానానికి వెళ్ళవలసిన మార్గమధ్యంలో కర్షకుల ఇళ్ళ మధ్య ఒక గుడిసెలో ఒక వితంతు స్త్రీ ప్రతి నిత్యం రాట్నం ఒడుకుతూనో, ధాన్యం దంచుతూనో కనిపించేది. కటుంబాన్ని పోషించవలసిన బాధ్యత ఆ స్త్రీ భుజస్కంధాలపై ఉన్నందున ఆమె నిరంతరం శ్రమిస్తూ ఉంటుందని మహర్షికి విషయం అవగతమైంది. ఆయన తన సహజ కరుణతో ఆమెవద్దకు వెళ్ళి "అమ్మా! నేను ఒక ఆశ్రమానికి కులపతిని. నావద్దకు అనేకమంది రాజకుమారులు విద్యాధ్యయనానికి వస్తూ ఉంటారు. నీ పరిస్థితిని వారికి వివరించి, వారి ద్వారా నీకు సహాయ సదుపాయాలు కల్గించాలని ఉన్నది" అని పల్కుతాడు.

ఆమె వినమ్రతతో, "దేవా! మీ కారుణ్యానికి నా ధన్యవాదాలు. కానీ నేను మీరనుకొన్నట్లు దరిద్రురాల్ని, నిస్సహాయురాల్ని మాత్రం కాదు. ఎందుకంటే నావద్ద మహారాజులకంటే కూడా సంపన్నంగా జీవింపజేయగల ఐదు అమూల్యమైన వజ్రాలున్నాయి. కానీ వాటి అవసరం ప్రస్తుతం నాకు పెద్దగా లేదనిపించి వాటిని భద్రంగా దాచాను" అని పలికింది.

ఆ పల్కులు కపిలమహర్షిని ఆశ్చర్య చకితుణ్ణి చేశాయి. ఇంతలో ఆమె ఐదుగురు బిడ్డలు బయటినుండి వచ్చి తల్లి పాదాలకు నమస్కరించి, "అమ్మా! ఈరోజు కూడా నీవు నిర్దేశించిన ప్రకారం దినచర్యను పవిత్రతో నిర్వర్తించి, గురువు బోధించినవి పరిశ్రమ ద్వారా ఆచరించి ఇల్లు చేరుకొన్నాము" అని ఆమె పాదాల వద్దనుండి లేచి నిలబడ్డారు.

ఈ దృశ్యం కపిలుని కన్నుల నిండా ఆనంద భాష్పాలను నింపింది. ఆ బిడ్డలను ఆశీర్వదించి, "అమ్మా! నీ బిడ్డలు నిజంగానే బహుమూల్యమైన వజ్రాలు. ఇటువంటి క్రమశిక్షణతో పెరిగే పిల్లలున్న నీకేకాక ఈ భారత భూమికికూడా దరిద్రం, నిస్సహాయస్థితి అనేది దరిదాపులకు రావు" అని పలికి వారివద్ద నుండి సెలవు తీసుకొంటాడు.

**కథ 50 : కు**టుంబంలో సత్ప్రవృత్తులను పెంపొందించటంలో స్త్రీకంటే ఉత్కృష్టమైన పాత్ర మరొకటి లేదు. మదాలస తన ముగ్గురు బిడ్డలను బ్రహ్మజ్ఞానులుగా తీర్చిదిద్ది, భర్త కోరిక మేరకు ఒక కుమారునికి రాజతంత్రంలో శిక్షణను ఇస్తుంది. తల్లియొక్క సుసంస్కారం ద్వారా ఉద్భవించిన మూడు అమూల్యమైన రత్నాలే వినోభ, వితోభ, బాలకోభ, అల్లరి పిల్లవాడైన కృష్ణుని పట్ల యశోద ఎంతటి అపార వాత్సల్యాన్ని చూపించిందో అందరకూ తెలుసు. అదే విధంగా అతడిని సంస్కరించడం పట్లకూడా ఆమె అత్యంత సావధానంగా ఉండేది. మహాభారతంలో పరిపూర్ణురాలైన మాతృమూర్తి ఎవరని ప్రశ్న ఉద్భవించినపుడు నిస్సంకోచంగా కుంతీమాతయేనని పేర్కొనటం జరిగింది.

పిల్లల అకృత్యాల పట్ల అంకుశాన్ని ఉపయోగించక ప్రేమపాశంతో ప్రోత్సహించేవారు భారతంలోని దృతరాష్ట్రునివలె దుఃఖిస్తూ చివరకు సర్వనాశనం కాక తప్పదు.

శ్లో॥ **షామాజికేషు చామూల్యం కురీతీనాం విధిష్వలమ్ ।**
**భవత్యేవ తథైకస్యకాలస్య రీతియో మునే ॥**
**అయోగ్యా అపరేకాలే హానిదాశ్చాపి సంమతాః ॥**
**జీర్ణతాయాం వరోమాన్యో నరో రుగ్ణః న్లథోభవేత్ ।**

**శుభకార్యాలను రేపటికి వాయిదా వేయకు. ఎందుకంటే - ఆ రేపు ఎన్నడూ రాదు.**

**రీతీనాం విషమే ష్వేవం జీర్ణోద్ధార ఇవక్రమః ।**
**సంశోధ్యాయా ధత్యాజ్యా స్త్యాజ్యాః సాహసపూర్వకమ్ ॥**

పరంపరలు కాలానుగుణమైనవే గాని, శాశ్వతమైనవి గావు. సంస్కర్తలు అనేవారు సమయానుకూలంగా సాహసంతో పరంపరంలో మార్పులు చేర్పులు చేసి అవసరమైన వాటిని ఉపయోగిస్తూ, అనవసరమైన వాటిని తొలగిస్తూ ఉండాలి. శిథిలమైన గృహం నేలమట్టం గాకుండా తప్పించలేము. ఈనాడు సమాజంలో వ్యాపించిన పరంపరలు కూడా శిథిల గృహాలవలెనే ఉన్నాయి. బుద్ధుడు, ఆదిశంకరుడు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, రాజా రామమోహనరాయ్, మదనమోహన మాళవీయ వంటి అనేకమంది అవతార పురుషులు, శూరులు, వీరులు, సంస్కర్తలు ఎన్నో విధాలుగా పరివర్తనలు గావించి కూలిపోతున్న సమాజానికి క్రొత్త ఊపిరి పోసి నిలబెట్టడం జరిగింది. వారు నడచిన బాటలో నడుస్తూ సంస్కర్తలు సాహసంతో ముందుకు ఉరికి ఈ బాధ్యతను చేపట్టవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**కథ 51 :** స్త్రీలకు వేదాధ్యయనం చేసే అధికారం ఉందా ? లేదా ? అనే విషయం మీద చర్చలు తలెత్తినపుడు పండిత మదనమోహన మాళవీయ ఒక పెద్ద విద్వాంసులు సభను ఏర్పాటు చేయటం జరిగింది. అందరూ వారి వారికి తోచిన విధంగా అభిప్రాయాలు వెలిబుచ్చటం జరిగింది. తర్కభూషణ పండిత ప్రధమనాథ్ ఒక్కరూ మాత్రం ఖపాల, ఘోషా, విశ్వవార మొదలైన బ్రహ్మవాదినుల గూర్చి వివరణ తెలుపుతూ మనువుయొక్క కుమార్తె ఇలాదేవి ద్వారా బ్రహ్మయొక్క యజ్ఞకర్మ నిర్వహించటం జరిగిందని అలాగే గార్గిద్వారా యాజ్ఞవల్క్యునికి శాస్త్రార్థాలు చెప్పబడ్డాయని తెలియ చెప్పటమేగాక, జనకమహారాజు కుమార్తెలు నల్గురకు శాస్త్రపరంగా యజ్ఞోపవీత సంస్కారాన్ని జరిపించుట జరిగినదని, రావణుడు సీతను అపహరించినపుడు ఆమెయొక్క యజ్ఞోపవీతం త్రెంచబడిందని, ఇటువంటి అనేక విషయాలను తర్కబద్ధంగానూ శాస్త్రీయ పరంగానూ తెలియజెప్పడంతో మిగిలిన విద్వాంసులెవ్వరూ ఆయనకు ఎదురునిలచి కాదనలేని పరిస్థితి ఎదురైంది. ఆనాడే బెనారస్ విశ్వవిద్యాలయపు తలుపులు స్త్రీలకు వేదాధ్యయనం కోసం సాదరంగా తెరువడ్డాయి. దురదృష్టమేమంటే ఇటువంటివి అనేకం జరిగినప్పటికీ, ఈనాడు కూడా ప్రగతికి అవరోధం కల్గించేవారు కొందరు ఇటువంటి వాటిని ఖండిస్తూ అవహేళన చేస్తూనే ఉన్నారు. కానీ మాళవీయుని వంటి సాహసోపేతులు ముందుకు రావాలి. జాతిబేధం విషయంలో కూడా ఆయన తీసుకొన్న సాహసోపేతమైన నిర్ణయం పదేపదే గుర్తుచేసుకోవాలి.

**కథ 52 : జ్యోతిర్విజ్ఞానం** అత్యంత ప్రధానమైనదే గాక జీవనోపయోగమైన విద్యకూడ. కొన్ని విశిష్టమైన నక్షత్రోదయ, అస్తమయాల వేళల్లో పంటలు నాటటం, పంటను కోసుకోవటంలో ఋతువిజ్ఞానం యొక్క అత్యంత మహత్వ పూర్ణమైన పర్యవేక్షణ ఆధారపడి ఉంది. కానీ **జ్యోతిష్యం యొక్క ఫలితాలు, శకునం అపశకునం వంటివి మాత్రం అహితకరమైనవే.**

**గు**రుగోవిందసింహ్ దర్బారులో ఒక జ్యోతిష విద్వాంసుడు శకున శాస్త్రం గూర్చి తెలియజేస్తూ ఈ శకునాల కారణంగానే సిక్కు సేన ఎన్నోసార్లు గెలవటం, ఓడటం సంభవించిందని తెలియజేస్తాడు. మౌనంగా వింటున్న గురుగోవింద్ సింహ్ పండితునితో, "అయ్యా! జ్యోతిషానుసారం మీ ఆయుష్షు ఎంత ఉండవచ్చు"ని ప్రశ్నిస్తాడు. 73 సం॥లు అని పండితుడు బదులు పల్కుతాడు. వెంటనే గురుగోవింద్‌సింహ్ ఖడ్గం తీసి "జ్యోతిషం ప్రకారం మీ వాక్కు ఎంతవరకూ ఫలించిందో నా ప్రజలు ఇప్పుడే తెలుసుకొంటారు" అంటూ అతని శిరస్సుని ఖండిస్తాడు. 52 సం॥ల జ్యోతిష్కుడు వెంటనే నేలకు ఒరగడం చూచి ప్రజలు నిశ్చేష్టులవుతారు.

గురుగోవిందసింహ్ ప్రజల నుద్దేశించి “సోదరులారా! సమాజానికి చీడపురుగులవంటి వీరిని వెంటనే ఏరిపారవెయ్యాలి. లేకుంటే సమాజమే సర్వనాశనమయ్యే పరిస్థితి యేర్పడటానికి ఎంతో కాలం పట్టదు” అని హెచ్చరిస్తాడు.

**కథ 53 : వి**వేకశూన్యమైన అంధానుకరణ అత్యంత హానికరమైనది. ప్రజలు తమ అజ్ఞానం వలన చుట్టూ ఉన్న కూడని పరిస్థితులను చక్కదిద్దటానికి బదులు నల్గురు ఆచరిస్తున్నారుకదా అని ఆ బాహ్యస్వరూపాన్నే చూచి, ఆమార్గమే శ్రేయస్కరంగా భావించి, తదనుగుణంగానే జీవయాత్ర సాగిస్తారు. తీర్థస్నానాలు, పుణ్యక్షేత్రాలు, దేవాలయ దర్శనాలు వంటి అనేకమైన బాహ్య ఆడంబరాల ద్వారా ప్రజలు ఆర్జిస్తున్నా మనుకొంటున్న పుణ్య ప్రయోజనం కూడా ఇటువంటిదే.

మణియార్ అనే ఆయన ఈశ్వర భక్తుడు. కాని ఆలోచనలు, ఆచరణాలు సవ్యంగా లేనందున అతనిలోని ఈశ్వర భక్తి అతనికి కాస్తయినా శాంతిని చేకూర్చేదికాదు. ఒకనాడు అతని భార్య భర్తతో “స్వామీ! మీ **దుఃఖానికి, అశాంతికి కారణం మనోమాలిన్యమే. కాబట్టి జ్ఞాన ప్రకాశంతో అంతరంగాన్ని శుభ్రం చేసుకోండి”** అని బోధిస్తుంది. భార్య మాటలు పెడచెవినిపెట్టి మణియార్ తీర్థక్షేత్రాలను దర్శించి పుణ్య నదులలో స్నానమాచరించి మనస్సును పవిత్రం చేసుకొంటానని చెప్పి తీర్థయాత్రకు బయలుదేరుతాడు. భార్యకూడా భర్తను అనుసరిస్తుంది. ఆమె తన వెంట ఒక చిన్న మూటను తీసికొనివచ్చి దానినికూడా పవిత్ర నదులన్నిటిలోనూ స్నానం చేయిస్తుంది. యాత్ర ముగించి ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత ఆ మూటలోని దుంపలను వండి భోజనంలో వడ్డిస్తుంది. దుర్గంధంతో కూడిన ఆ పదార్థాన్ని చూచి మణియార్ కోపంతో యేమిటిదని ? ప్రశ్నిస్తాడు. భార్య వినయంతో “పవిత్ర జలాల్లో స్నానం చేసి వచ్చిన దుంపలు పవిత్రమని, శుద్ధమని, విశిష్టమైన రుచికల్గి ఉండటానికి బదులు దుర్గంధం వెదజల్లుతున్నాయంటే అవి ఆశించినట్లుగా పవిత్రం కాలేదని అర్థమవుతోంది” అని పలుకగానే మణియార్ భార్య మాటలోని అంతరార్థాన్ని గుర్తించి సిగ్గుతో తల వంచుకొంటాడు.

**కథ 54 :** ప్రచారంలోనున్న అనేక వదంతుల వెనుక అవివేకమే పూర్తిగా పనిచేస్తూ ఉంటుంది. ఆ అవివేకాన్ని దూరం చేయకుండా సమాజ సంస్కరణ అనేది ఎంతమాత్రం సాధ్యంకాదు. గ్రుడ్డిగా అనుకరించటం, ఔచిత్యం-అనౌచిత్యం మధ్యగల వ్యత్యాసాన్ని గుర్తించక పోవటం, బౌద్ధిక పరావలంబన-ఇవి వెంటనే వదలివేయ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఒక మిత్రుడు సంపన్నుడైన మిత్రునితో అతని అత్తవారింటికి వెళ్ళటం సంభవించింది. ధనవంతుల వెంట వెళ్ళటం ఇదే మొదటిసారి కావటాన మిత్రుని ప్రతి కదలికను జాగ్రత్తగా పరిశీలించసాగాడు. అవి వేసవి రోజులు. మిత్రునికి అత్తవారు ఆరుబయట శయ్య యేర్పాటుచేసి కప్పుకోవటానికి అతి సన్నని ముఖమల్ శాలువ ఇస్తారు. అలాగే శయ్యకు నలువైపులా కడవలతో నీరుజల్లి నేలంతా చల్లబరుస్తారు. మిత్రుడు ఇదంతా హుందాతనానికి చిహ్నంగా భావించి మనస్సులో గుర్తుపెట్టుకొంటాడు. కొంతకాలం తర్వాత ఇతనికి కూడా అత్తవారింటికి వెళ్ళవలసిన అవకాశం వచ్చింది. కానీ అవి బ్రహ్మాండమైన చలిరోజులు. అత్తవారు ఎంత కాదన్నా వినకుండా ఆరుబయట శయ్య ఏర్పాటు చేయించుకొని, శయ్య చుట్టూ కడవలతో నీరు జల్లించుకొని, సన్నని శాలువా కప్పుకోని అచ్చంగా ధనవంతుడైన మిత్రుని వలెనే అనుకరణ చేస్తాడు. విపరీతమైన చలివల్ల మరుసటి దినానికి దారుణంగా సుస్తీ చేస్తుంది. గట్టి చికిత్స చేయించగా అతికష్టమీద

**సన్మార్గంలో నడిచే వ్యక్తికి నిజమైన పరీక్ష కష్టాలలోనే ఎదురవుతుంది.**

గండం గడిచి బయటపడతాడు. అంధానుకరణకు ప్రతిఫలం ఇది.

**కథ 55 :** ఒక వ్యాపారి ఉప్పు బస్తాలను గుఱ్ఱంమీద, దూదిమూటను గాడిదమీద పెట్టి ప్రయాణం సాగిస్తూ ఉంటాడు. మార్గమధ్యంలో ఒక నది దాటవలసి వస్తుంది. నీటిలో దిగిన గుఱ్ఱం రెండు మూడు సార్లు నీళ్ళలో మునిగి లేస్తుంది. అలా మునగడానికి కారణమేమిటని గాడిద గుఱ్ఱాన్ని ప్రశ్నించగా కాస్త బరువును తగ్గించుకోవటానికని గుఱ్ఱం బదులు పల్కింది. కొంచమైనా ఆలోచించక గాడిదకూడా వెంటనే నీటిలో మునిగింది. వీపువైపున్న దూదిమూట మరింత బరువెక్కి మోయలేక తల్లడిల్లింది. అవగాహన లేకుండా ప్రతిదీ ఇతరులను అనుకరిస్తూ పోతూఉంటే సుఖం కంటే దుఃఖం, మంచి కంటే కీడు ఎక్కువ పొందుతూ ఉంటాం.

ఆడంబర వివాహాలు, శ్రాద్ధకర్మలు, ఇచ్చిపుచ్చుకోవటాలు, వరదాపద్ధతులు, ఒకటేమిటి-ఇటువంటివి అనేకం ఎప్పుడో ఎవరో చేశారని ఇప్పటికీ అనుకరిస్తున్న **అంధానుకరణయే.** నేటి పరిస్థితులకు అనుగుణంగా జీవించడం వివేకవంతుని లక్షణం. ఎవరో చేశారు, మనం చేయకపోతే బాగుండదు వంటి మూర్ఖత్వాన్ని విజ్ఞతతో విడనాడటం సర్వవిధాల క్షేమకరం.

**శ్లో॥ లోకప్రవాహ కస్యాస్తే జలమార్గంతు పంకిలమ్ ।**
**ప్రాయోల్పాః సజ్జనాః సన్తి బహవో సంస్కృతా జనాః ॥**
**గతిః సానుపయోగ్యాహి ప్రాయోరీతిషు ధావతి ।**
**యధావత్సా నహి గ్రాహ్యా, హంసః క్షీరం జలాత్ పిబేత్ ॥**

**లో**క ప్రవాహపు కాలువ వెంట సదా చెత్తాచెదారం ఎక్కువగా ప్రవహిస్తూ ఉంటుంది. అశిక్షితులు అజ్ఞానుల సంఖ్య అధికంగాను, సజ్జనుల సంఖ్య అల్పంగాను అలాగే అవాంఛనీయత అధికంగానూ, శ్రేష్ఠత అతి స్వల్పంగాను ఈనాడు సర్వత్రా దృష్టిగోచర మవుతూ ఉన్నదే. జన సముదాయాలను ఉత్కృష్టమైన ఆచారాలు, సిద్ధాంతాలు వైపు లాక్కొని పోగల శక్తి దేనికైనా ఉన్నదా అంటే కేవలం ఆలోచనాక్రాంతి ఒక్కదానికేనని నిష్కర్షగా చెప్పక తప్పదు. ఉచితానుచితాల మధ్య వ్యత్యాసాన్ని ప్రజలు గుర్తించగల్గి వారి హృదయాలలో వివేక శక్తి మేల్కొనాలంటే ప్రజ్ఞయొక్క ఆశ్రయం వారికి లభించినప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. హంస పాలను స్వీకరించి నీటిని వదలినట్లుగా క్షీరనీర న్యాయం ప్రజ్ఞయొక్క ఆశ్రయం వలననే వీలవుతుంది. పరంపరల ప్రస్తావన వచ్చినపుడు వివేకవంతులు "జనవాక్యం, కర్తవ్యం" అంటూ సమూహం యొక్క అభిప్రాయాన్ని శిరోధార్యంగా భావించక, హంసలా క్షీరనీర న్యాయాన్ని ఆశ్రయించటం తమ తక్షణ కర్తవ్యంగా భావించాలి.

**కథ 56 :** ఒక గుడ్లగూబ కూర్చున్న చెట్టుమీదికి హంసకూడా వచ్చి వ్రాలింది. స్నేహంగా మాటలు కలుపుతూ ఈరోజు సూర్యభగవానుడు ప్రచండంగా ప్రకాశిస్తున్నాడు, ఎండ విపరీతంగా ఉంది అని పలికింది. గుడ్లగూబ నవ్వి సుర్యుడెక్కడున్నాడు- ప్రస్తుతం చీకటి పెరగడంతోపాటు వేడికూడ ఎక్కువ అవుతుంది. ఇప్పుడు జరిగింది కూడా అదేనని అంటుంది. మిగిలిన గుడ్లగూబలన్నీ కూడా పకపకా నవ్వుతూ హంసని మూర్ఖురాలిగా నిందిస్తూ, సూర్యుడున్నాడనే విషయం ఎంతగా చెప్పినా ఒప్పుకోక, హంసమీద తిరుగుబాటు చేస్తాయి. గత్యంతరం లేక హంస ప్రాణభీతితో అక్కడనుండి పారిపోయింది. ఆ చెట్టుక్రిందనే యున్న పైగలుడనే మహర్షికి పక్షిభాష తెలుసు. ఆయన త్రికాలజ్ఞుడు కూడా. ఈ సంఘటనను గూర్చి శిష్యులకు వివరిస్తూ, నాయనలారా! ఈనాడున్న ధార్మిక పరంపరలు కలియుగం వరకు చేరుకొనేసరికి కేవలం బాహ్య

**విశ్వ శ్రేయస్సు కోసం తన సుఖాన్ని త్యాగం చేయడం మహత్తర సాహసం.**

ఆడంబరాలుగా మాత్రమే తయారవుతాయి. సమాజంలో అధిక శాతం ప్రజలు గుడ్లగూబలవలె శిథిల సాంప్రదాయాలను పట్టుకొని విర్రవీగుతూ ఉంటారు. కేవలం వివేకవంతులు మాత్రమే హంసవలె వాస్తవాన్ని గుర్తిస్తారు అని పలుకుతాడు. దానికి శిష్యులు, గురుదేవా ! వివేక వంతులు ప్రాణభీతితో హంసవలె పారిపోకుండా తిరిగి ధార్మిక సంప్రదాయాలను పునర్జీవింప చేయాలంటే యేమి చేయాలని ప్రశ్నిస్తారు. దానికి మహర్షి ఒకసారి కన్నులుమూసి, "బిడ్డలారా! ఒక మహాప్రజ్ఞ వివేకవంతుల మధ్య ఆవిర్భవించి ప్రాణభీతితో వారిని పారిపోనీకుండా చేస్తూ వారిద్వారా సంస్కృతిని, సాంప్రదాయాలను పునర్జీవింపచేస్తుంది. ఆవిధంగా మలచబడిన ఒక్కొక్క హంస అనేకమైన హంసల సముదాయాలతో దండెత్తివచ్చి సమాజంలోని గుడ్లగూబలను తరిమికొట్టి వివేకాన్ని, వాస్తవాన్ని స్థాపించి తీరుతుంది" అని పైగలుమహర్షి బదులు పల్కుతాడు.

**కథ 57 : ఒ**కనాడు ఒక సేఠ్ మదనమోహన మాళవీయ వద్దకు వెళ్ళి తాము యేర్పాటు చేస్తున్న బ్రహ్మాండమైన పెండ్లి విందుకు తప్పక రావలసిందిగా ఆహ్వానిస్తాడు. కానీ ఆయన వినమ్రతతో, "అయ్యా! మీవంటి పెద్దలు స్వయంగా నావంటి చిన్నవానిని ఆహ్వానించటానికి వచ్చారు ధన్యుడను. కానీ నాదేశంలో లక్షలమంది సాటి సోదరులు ఎంగిలాకులు నాకి కడుపు నింపుకొంటూ జీవిస్తూ ఉన్నంతకాలం నేను రకరకాల పదార్థాలతో కూడిన పెండ్లి విందులో ఎలా పాల్గొనగలను? అవి నాగొంతు దిగక నాకు ఇబ్బంది కల్గిస్తాయి. నన్ను క్షమించండి, నేను రాలేను అంటూ తిరస్కరిస్తాడు. మాళవీయజీ పవిత్రమైన వాక్కులోని అంతరార్థం, అతని హృదయంలోని ఆర్తి సేఠ్‌జీకి అర్థమయ్యింది. కేవలం విందుభోజనాలు యేర్పాటు చేసినంత మాత్రాన కీర్తి ప్రతిష్ఠలు రావని, దేశకాల పరిస్థితుల కనుగుణంగా సాంప్రదాయాలను మార్చుకోగల త్యాగపురుషులవలె జీవించాలని అర్థంచేసికొంటాడు. వెంటనే నిర్ణయాన్ని మార్చుకొని విందుకోసం ఖర్చుచేసే ధనాన్ని అంతనూ పేదల అన్నదానానికి వినియోగిస్తాడు.

**కథ 58 : "అ**పుత్రస్య గతిర్నాస్థి" వంటి నమ్మకాలు ఈనాడు కూడా ప్రజల హృదయాలలో బలంగా ఉన్నాయి. మహేంద్రప్రతాప్ అనే రాజువద్దకు ఒక జ్యోతిష్కుడు వచ్చి, "రాజా! మీ జాతకంలో పుత్రసంతానయోగం లేదని, **అపుత్రస్య గతిర్నాస్థి** కాబట్టి మీరు ఒక ప్రత్యేకమైన అనుష్ఠానం చేస్తే పుత్ర సంతానం కలుగవచ్చునని తెలియజేస్తాడు. రాజు కోపంతో అతనిని బయటకు గెంటి వ్యర్థ సంభాషణలతో ఇలా ఎవ్వరి కాలాన్ని వృధా చేయవద్దని ఆజ్ఞాపిస్తాడు. ప్రజలనుద్దేశిస్తూ, "సోదరులారా! వంశాన్ని ఉద్ధరించటానికి జీవధారియైన పుత్రుడే అవసరం లేదు. పుత్ర సంతానం కోసం, పుత్రుని పోషణ కోసం ఖర్చుచేసే సంపదను సత్ప్రయోజనాలకు ఖర్చుచేసిన నాడు నా ఒక్క వంశమేగాక అనేక వంశాలు తరిస్తాయని తెలియజేస్తాడు. చెప్పటమేగాక ఆయన తూ.చ. తప్పక ఒక యువరాజు నిమిత్తం ఖర్చుచేసే సంపదను వినియోగించి, **బృందావన ధామంలో ప్రేమమహా విద్యాలయాన్ని** నిర్మిస్తాడు. ఆ రాజు తన వీలునామాలో తన వంశాన్ని ఈ ప్రేమ మహా విద్యాలయమే ముందుకు నడిపిస్తుందని వ్రాసిపెడతాడు.

**కథ 59 : ఘో**షా పద్ధతికూడా ఇటువంటి కుళ్ళిన సాంప్రదాయమే. ఇంకా ఇది ఈనాటికీ సమాజంలో వ్యాపించి ఉండటం శోచనీయం.

ఆలహాబాదులో ఒక సభలో మౌలానా ఆజాద్, మహాత్మాగాంధీ ఇద్దరూ ఉపన్యసించ వలసియున్నది. ముస్లిమ్ అధిపత్యం ఉన్న సమాజం కావటం వలన, ముస్లిం మహిళల కోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయబడ్డాయి. వారి చూపులు వక్తమీద, మిగిలిన శ్రోతలమీదా పడకుండాను అలాగే వక్తలు శ్రోతల దృష్టిని వీరిమీద పడకుండాను

**పొరపాట్లను సరిదిద్దుకోవడం వివేకానికి గుర్తు.**

గట్టి బందోబస్తు చేయబడింది. అయినా కార్యకర్తలకు తృప్తి లేక ఏర్పాట్లలో యేమైనా లోటుపాట్లు జరిగాయేమోనని వారు మౌలానా ఆజాద్‌ను, బాపూను కళ్ళకు గంతలు కట్టుకొని ఉపన్యసివలసిందిగా ఆదేశిస్తారు. మౌలానా ఆజాద్ తాను వెనుతిరిగి నిలబడి మాట్లాడతానని, గాంధీజీ తాను కళ్ళను క్రిందకి వాల్చి క్రిందిచూపులు చూస్తూ ఉపన్యసిస్తానని కార్యకర్తలకు హామీఇచ్చి నిశ్చింతగా ఉండమని తెలియచేస్తారు. ఎలాగో మౌలానా ఆజాద్ ప్రవచనం పూర్తయ్యింది. హాస్యాస్పదమైన ఈ యేర్పాట్లకు చింతిస్తూ బాపూ ఉపన్యాసం ప్రారంభించగానే ముస్లిం వనితలు పరదాలు వెనుక నిలువజాలక ముసుగులు, పరదాలు తీసిపారవేసి బాపూ పాదాల వద్దకు వచ్చికూర్చొని శ్రద్ధతో ప్రవచనాన్ని ఆలకించసాగారు. ఈ సంఘటన వారిలో ఒక విప్లవాన్ని లేవదీసిందని, తరువాత ఇదే పెద్ద విప్లవంగా మారిందని అగ్రగాములైన మహిళలు తెలియజేశారు. స్త్రీలంతా పురుషులలో మహాత్ముని, పురుషులంతా స్త్రీలలో దేవీరూపాన్ని దర్శించటం ఆరంభిస్తే ఇటువంటి ఘోషా పద్ధతి సమూలంగా నాశనం కావటానికి స్వల్పకాలం సరిపోగలదని **రాజర్షి టండన్‌జీ** తన ఉపన్యాసంలో తెలియజేశారు.

**శ్లో॥ ఆకర్షణాని సర్వస్వం కాలికాని న మన్యతాం ।**
**పరిణామేషు కర్తవ్యో విచారో దూరగామిషు ॥**
**దుఃఖదాహః పరిణామాయే లాభాస్తాత్కాలికా మతాః ।**
**త్యాజ్యాంతే సాహసేనైవం భవిష్యన్మంగళమ్ వ్రజేత్ ॥**

ప్రతీ కట్టుబాటు సాంప్రదాయం యొక్క బాహ్యరూపాన్ని, తాత్కాలిక ఆకర్షణను సర్వస్వంగా భ్భావించటం గాక దూరదృష్టితో వాటియొక్క పరిణామాన్ని ఆలోచిస్తూ ఉండాలి. ముఖ్యంగా వరకట్నం అనేది అప్పటికప్పుడు బాగానే ఉంటుంది. అందరి దృష్టిలో ఎక్కువ కట్నం తీసుకొన్న వ్యక్తి గొప్పవాడుగా భావించబడుతున్నట్టూ, తన కుమార్తెను ఎక్కువ కట్నం తీసికోగల గొప్పవానికి ఇచ్చినట్లు; హోదా పెరిగినట్లు ఇరుపక్షాల వారికీ అనిపించవచ్చును. కానీ ఇదేస్థితి కొనసాగి అల్లుడు మామగారి హోదాను ఆసరాగా తీసుకొని తన కోరికలతో వేధించటం మొదలెట్టినప్పుడు తామెంత పొరపాటు చేసినదీ అర్థమై నెత్తీనోరు మొత్తుకోవలసి వస్తుంది. ఇదే విధంగా పెద్ద మొత్తాన్ని కుమారునకు కట్నంగా తీసికోవడం హోదాగా భావించిన తండ్రి తన కుమార్తెకు వివాహ సమయం ఆసన్నమయ్యేసరికి ఆడపిల్లల తండ్రుల బాధను అనుభవించక తప్పదు. ఒక వేళ ఆనాడు అతడు ఆదర్శాలు వల్లించినా అతనిగోడు వినే నాథుడే ఉండడు. కాబట్టి ప్రతివ్యక్తి తాత్కాలిక లాభాలను పక్కకుపెట్టి దూరదృష్టితో సంకల్పాలు తీసికొంటూ, సమాజంలో సత్ప్రవృత్తుల సంవర్ధనం కోసం పాటుపడాలి. అప్పుడే ఈ కురీతియుక్త సమాజాన్ని నవనిర్మాణం గావించే ఉత్కృష్టమైన భాగస్వామ్యం వహించటానికి వ్యక్తి అర్హుడవుతాడు.

**కథ 60 : దూ**రదృష్టి లోపించటం వలన ఎదుర్కోవలసిన దుష్పరిణామాలు సర్వవిదితమే. అలాగే తాత్కాలిక ఆకర్షణలు, అనుక్షణం చేయిజాపి మనలను ఆహ్వానిస్తాయనేది కూడా క్రొత్త విషయం కాదు. ఎవరికివారు వివేకంతో తాత్కాలిక ఆకకర్షణల బారినుండి రక్షింపబడటానికి మార్గం వెతుక్కుంటూ ఉండాలి.

**ఒ**క సమూహం ఎడారిగుండా పయనిస్తూ ఉండగా మార్గమధ్యంలో చీకటిపడింది. కొన్ని ఫలవృక్షాలు దగ్గరలో కనిపించగానే అందరూ రాత్రి అక్కడ విశ్రమించటానికి నిశ్చయించుకొని ఆతృతగా ఆ పండ్లను భుజించాలని చెట్లవద్దకు సమీపించారు. కాని, వివేకవంతుడైన వారి యజమాని తొందరపడి పండ్లను తినవద్దని వారిస్తూ, "సోదరులారా! కాస్త ఆలోచించండి. ఈ బాట వెంట మన కంటె ముందు అనేక

**జీవితాన్ని విషలం చేసే ప్రమాదకర లక్షణం తొందరపాటు.**

సమూహాలు పయనించినట్లు మనకు జాడలు తెలుస్తున్నాయి. అయినా, ఈ ఎడారిలో పండ్లు అలాగే సురక్షితంగా ఉన్నాయంటే వీటి వెనుక తప్పని సరిగా ఏదో రహస్యం ఉండి తీరాలి. కాబట్టి వివేకంతో ఆలోచించండి" అని పల్కుతాడు. వారు పండ్లను పరీక్షించగా అవి తినగూడని విషపూరితమైన ఫలాలని నిర్ధారించబడింది. **'పరీక్ష తర్వాతే ప్రయోగం'** అని వారంతా గుర్తిస్తారు.

**కథ 61 : దూ**రదృష్టితో తీసికొన్న నిర్ణయాలు ఒక్కొక్కసారి తాత్కాలికంగా బాధ కల్గించినా, నెమ్మదిగా శాశ్వతమైన సత్ఫలితాలను అందించి తీరుతాయి.

సామ్రాట్ పుష్యమిత్రుని సేనాధిపతిమీద ఒక అభియోగం మోపబడింది. న్యాయవిచారణకు ఆచార్యుడైన మార్గాండుని నియమించడం జరిగింది. మర్నాడు న్యాయవిచారణ జరుగవలసి ఉండగా అర్ధరాత్రి సేనాధిపతి అంతులేని ధనరాసులతో మార్తాండుని వద్దకు వచ్చి, 'అయ్యా! ఈ సంపద నీ దారిద్ర్యాన్ని క్షణంలో దూరం చేస్తుంది. కాబట్టి ప్రతిఫలంగా తీర్పు తన పక్షాన చెప్పమని, ఈ విషయం గుప్తంగా తమ మధ్యనే ఉంటుందని' తెలియచేస్తాడు. కానీ ఆచార్యుడు ఆ ధనరాశులవంక అత్యంత తిరస్కార భావంతో చూస్తూ 'సేనాధిపతీ ! మహాపురుషుడు భూమి, అతని ఆత్మ ఆకాశం, ఈ ఆత్మకు పరమాత్మకు మధ్య ఏదైనా విషయం ఎరుకపరచబడినపుడు ఆ విషయం గుప్తంగా ఎలా దాచబడుతుంది. కర్తవ్యం, బాధ్యతల వంటి దైవదత్తమైన వాటి జోలికిపోక ప్రలోభానికి లొంగి వాటిని నట్టేట ముంచేందుకు దయయుంచి ఎవ్వరినీ వివశుల్ని చేయక వెంటనే ఇక్కడ నుండి తొలగిపొందు' అని గర్జిస్తాడు.

తాత్కాలిక లాభాలను ఆపేక్షించే బదులు ఆత్మకల్యాణం గూర్చి ఆలోచించగల ఇటువంటి ఆదర్శ మూర్తులు సమాజంలో దినదినాభివృద్ధి చెందినవాడు అక్కడికక్కడే అనంతమైన సుఖం, సంతృప్తి తాండవిస్తాయి.

**శ్లో॥ వివేకయుక్తో య ఆస్తే పరామర్శః సమన్యతామ్ ।**
**బాలానాం వా పరేషాం వా నాయోగ్య ఆత్మనాయిపి ॥**
**తధ్యానాం గరిమా శ్లాఘ్యోసత్య పక్షతయామునే ।**
**నవీనత్వం పురాణత్వం శ్రేష్ఠతాయైన వాంఛితమ్ ॥**

**స**న్మార్గంలో పయనించమంటూ చెప్పే సలహా ఇంత చిన్నదైనా అతి పిన్నవయసులోనున్న వారు చెప్పినా విస్సంకోచంగా వినవచ్చు. పరులు, పదనివాళ్ళు అయినాసరే వివేక పూరితంగా సత్పరామర్శను మంచి సలహాను అందజేసినట్లయితే నిర్మొహమాటంగా స్వీకరించవచ్చు. మనవారేయని గాని, మన కంటే పెద్దవారని గాని మొహమాటానికి పోయి చెడు సలహాలను స్వీకరించవలసిన అవసరం ఎంతమాత్రం లేదు. విషయం ప్రాచీనమైనదా నవీనమైనదా అనికాక, సత్యానికి దగ్గరగా ఉన్నదా ? దూరంగా ఉన్నదా ? అని ఆలోచించి విలువనివ్వాలి. పదే పదే వాడుకలో నున్నది కావున ప్రామాణికమైనదిగా భావించి స్వీకరించాలని నియమమేమీ లేదు. వాస్తవానికి దగ్గరగా ఉంటే వాడుకలో లేకపోయిన ప్రామాణికంగా తీసికోవచ్చు.

సమాజం యొక్క వయనం వ్యతిరేక దిశాధారల వెంట ప్రవహిస్తోంది. చేప చిన్నదే అయినా నీటికి ఎదురీది పైకి రాగల్గుతోంది. కానీ అత్యంత శక్తివంతమైన ఏనుగు, ప్రవాహం యొక్క ధాటికి నిలువలేక కొట్టుకొని పోతుంది. కాబట్టి కావలసినది బుద్ధిబలంగానీ దేహబలం కాదని అర్థమవుతోంది. సంఘర్షణల నుండి బయట పడాలని ప్రజలు ఆశించటం సహజం. కాని పిరికితనంవల్ల, సాహసహీనతవల్ల మానవులు

**వాణిని దుర్వినియోగపరిస్తే వైఫల్యం తప్పదు.**

అవినీతి ఎదుట తలవంచుతున్నారు. కానీ సమాజ ప్రవాహ దిశాధారలకు తలవంచటం కాక, ఎదురీదగల వివేకం, బుద్ధి ఈనాడు అత్యంత ఆవశ్యకంగా గుర్తించాలి. సత్సాహసం సర్వశ్రేష్ఠమైన సంపదగా తెలుసుకోబడాలి.

**కథ 62 :** బంధువులు, సర్వజనులు మొత్తం రాజ పరివారమంతా భక్త మీరాను పలువిధాల బాధిస్తూ ఉండగా ఆమె దిక్కుతోచక భక్త తులసీదాసుకు ఒక ఉత్తరం వ్రాసి ఇటువంటి పరిస్థితులలో స్వీకరించవలసిన మార్గం ఏమిటో చెప్పమని ప్రార్థిస్తుంది. దానికి తులసీదాసు ఎవరికివారు ఆత్మశక్తిని ఆశ్రయించవలసిన మార్గంగా బోధచేస్తూ ఆయన ఇచ్చిన ఆదేశం యేమంటే -

**"జాకే ప్రియ రామ్ వైదేహీ,**
**తజియే తిన్హాహి కోటి బైరీసమజదపి పరమ సనేహీ ।**
**పితా తజ్యే ప్రహ్లద, విభీషణబంధు, భరతమహతారీ,**
**బలిగురు తజ్యౌ, కంతబ్రజ బనితన భయే ముద మంగళకారీ ॥**

విభీషణుడు సోదరుడైన రావణుని, ప్రహ్లాదుడు జన్మనిచ్చిన తండ్రి హిరణ్యకశిపుని, భరతుడు మాతృమూర్తియైన కైకేయినీ, బలిచక్రవర్తి గురువైన శుక్రాచార్యుని వ్రజవనితలు కృష్ణవిరోధులైన భర్తలను ఏ విధంగా వదిలి వేశారో, అదే విధంగా ఈశ్వరీయ శక్తియందు విశ్వాసంలేని వారిని మనకెంత దగ్గర బంధువులైనా సరే కోటి శత్రువులుగా భావించి తక్షణం పరిత్యజించాలి. ఎన్నిక మనముందు చేతులు కట్టుకొని నిలబడినపుడు వివేకం, ఔచిత్యంతో శ్రేష్ఠ మార్గాన్నే ఎంచుకొని తీరాలని తులసీదాసు సందేశంలో తెలియజేస్తారు.

**కథ 63 :** సముద్ర ప్రయాణం ద్వారా విదేశీయాత్ర ఆనాడు ధర్మ విరుద్ధంగా భావించబడేది. ప్రతీ ధార్మిక వ్యక్తి ధార్మిక పురోహితుల అనుమతి తీసికొని వారి ఆదేశం మేరకు మాత్రమే సముద్రయాత్ర చేయవలసివచ్చేది. స్వామీ రామతీర్థునికి కూడా వేదాంత ప్రచారానికై విదేశాలు వెళ్ళవలసి వచ్చినపుడు లోక మర్యాదను పాటిస్తూ ఆయన కాశీలోని మహా మహోపాధ్యాయుని అనుమతిని కోరటం జరిగింది. ధర్మ విరుద్ధమైన సముద్ర ప్రయాణం అంగీకరించబడాలంటే నీవు ఐదువేల రూపాయలు చెల్లించినట్లయిన సముద్రయాత్రా విరోధమండలి ద్వారా నీకు అనుమతినిప్పిస్తానని, అలా చేయలేని పక్షంలో నిన్ను జాతి బహిష్కృతుని గావించవలసి వస్తుందని మహామహోపాధ్యాయుడు రామతీర్థుని హెచ్చరిస్తాడు. లంచమిచ్చి ధర్మపరాయణుడుగా గుర్తింపు పత్రాన్ని పొందటం రామతీర్థునికి బొత్తిగా నచ్చలేదు. మీరు అనుమతి ఇచ్చినా ఇవ్వకున్నా వేదంత ప్రచారానికై సముద్రయాత్ర ద్వారా విదేశాలు వెళ్ళక మాననని చెప్పి, తన మహోన్నత లక్ష్యసాధనకు రామతీర్థుడు నిర్భీతితో బయలుదేరి వెళ్ళడం జరిగింది. ఉన్నత లక్ష్యసాధనకై అవినీతితో పోరాడగల ఇటువంటి సత్సాహస సంపన్నులే మహోన్నత శిఖరాల అంచులు తాకగలరని ఋజువుచేసి చూపించాడు.

**కథ 64 :** గుజరాత్‌లోని ఒకసేఠ్ యొక్క కుమారుడు పెద్ద చదువులు చదివి యుక్త వయస్కుడైన తర్వాత మరణిస్తాడు. దివంగతుడైన పుత్రునికోసం కంటె కూడా వితంతువైన కోడల్ని చూసి సేఠ్ ఎక్కువ దుఃఖించేవాడు. ఈమె జీవిత పర్యంతం ఇలా వైధవ్యంతో మగ్గవలసిందేనా అంటూ ఆలోచించి, ఆవేదన చెంది చివరకు కూతురువంటి ఈ కోడలుకు పునర్వివాహం చేస్తే మంచిదని సంకల్పం తీసుకొంటాడు. ఆ రోజుల్లో సమాజం స్త్రీకి పునర్వివాహం మాట ఎత్తితేనే సహించని గడ్డురోజులు. అయినప్పటికి, సాహసంతో యోగ్యుడైన వరుణ్ణి వెదకి కోడలికి పునర్వివాహం చేస్తాడు. ఇటువంటి సాహసం వ్యక్తిని తాత్కాలికంగా

అపదలకు, అపనిందలకు గురిచేసినా, చివరకు సమాజ సంస్కర్తల పంక్తిలో ఇటువంటి సాహసులు మొదటగా నిలబెట్టబడతారు.

**కార్వే** మహర్షికి పూర్తిగా సమాజం ఎదురుతిరిగింది. అయినా ఒక్కడు నారీ ఉద్ధరణ కార్యభారాన్ని భుజ స్కంధాలపై స్వీకరించి, తాను స్వయంగా ఒక వితంతువును వివాహమాడి ఆమెకు విద్యాబుద్ధులు చెప్పింది స్వశక్తి మీద జీవించేలా చేసి, స్త్రీ విద్యగురించి ఒక పెద్ద ఉద్యమాన్ని లేవదీసి సమాజంలో ఒక విప్లవం చెలరేగేలా కృషిచేశాడు. చివరకు పూర్తి సాఫల్యాన్ని సాధించి సమాజం ద్వారా జోహారనిపించుకొన్నాడు.

**శ్లో॥ శూరా అపిచ వీరాశ్చ విఖ్యాతా యే జనాస్తుతే ।**
**దృశ్యంతే దుర్బలాః ప్రాయః క్షేత్రే సైద్ధాంతికే సదా ॥**
**ఆత్మ విశ్వాసినో యేతే సదా ధర్మ సమర్థనే ।**
**ఏకాకీ నః స్థితాః సంతు సహాయాః సంతు వానవా ॥**

సైద్ధాంతిక పక్షానికి వచ్చేటప్పటికి శూరులు వీరులుగా చెప్పుకొనేవారు. అనేక మందిని దుర్బలత్వం ఆవహిస్తుంది. నిజమైన శూరుడు, వీరుడు సిద్ధాంతాలను ఆచరణలో పెటగలవాడే. అలాగే సిద్ధాంతాలను అమలు పరచవలసిన సమయమే అసలైన పరీక్షా సమయం, మల్లయుద్ధము మాత్రమే యుద్ధమని, ఖడ్గాలతో చేసేదే పోరాటమని ఎంత మాత్రమూ భావించరాదు. శారీరకంగా అత్యంత బలహీనుడైన వ్యక్తికూడా అవినీతి పక్షాన ఉన్న వ్యక్తితో వీరోచితంగా పోరాడి నీతిని గెలిపించ గలడు. మహాత్మాగాంధీ 96 పౌనుల క్షీణకాయుడు. కానీ ఆయనయొక్క సైద్ధాంతిక సమర్థనం కోట్ల ఏనుగల కంటె శక్తివంతమైంది. ఈ శక్తితోనే ఆయన సూర్యుడు అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని ఎదుర్కోగల్గేరు. ఇటువంటి సాహసవంతులైన వ్యక్తులకు **అవినీతితో సహకరించవద్దని ఎదురు నిలిచి పోరాడమని అనవరతము ఒక అదృశ్య ప్రేరణ లభిస్తూ ఉంటుంది.**

**కథ 65 : ఒక**మరాఠీ సర్దార్ పైన బావమరిదిని హత్య చేశాడనే అభియోగం ఉన్నది. న్యాయ విచారణ జరుపమని కోర్టు శ్రీరామశాస్త్రిని న్యాయ నిర్ణేతగా నియమించింది. సత్యనిష్ఠగల వీరి ద్వారా తనకు శిక్ష తప్పదని సర్దార్ భీతిచెందాడు. కానీ సర్దార్‌జీ భార్య శాస్త్రీజీ వద్దకు రహస్యంగా వెళ్ళి తీర్పు తమ పక్షాన చెప్పమని కట్టలధనాన్ని లంచంగా చూపించి పలోభం కల్గించడానికి ప్రయత్నించింది. న్యాయ నిష్ఠుడని దశదిశలా ఖ్యాతినెందిన రామశాస్త్రి తుచ్ఛమైన ఆ ధనానికి, ప్రలోభానికి యే మాత్రం లొంగక, ఆమె భర్తకు మరణదండన తప్పదని ఖచ్చితంగా తెలియజేస్తాడు. అతని నిర్భీతికి ఆమె కోపించి ఈ తీర్పుయొక్క పరిణామం బ్రతికుండగానే నీ నాలుకను కోసి నిన్ను సజీవంగా పాతిపెటటానికి దారితీస్తుందని బెదిరిస్తూ ఆమె అక్కడనుండి నిష్క్రమిస్తుంది. ఆ విధంగా చేయగల సమర్ధులేనని శాస్త్రీజీకి తెలిసికూడ, యే మాత్రం భీతిచెందక న్యాయాన్ని గెలిపించిన పిమ్మట నాలుక కోసినా, శిరస్సు ఖండించినా ఆనందమే నంటూ పల్కి న్యాయదేవత మెడలో పూలహారాన్ని సమర్పిస్తాడు.

**కథ 66 : శ్రీ** చిమన్‌లాల్ శీతల్వాడ్ బొంబాయి విశ్వవిద్యాలయములో ఉప కులపతిగా నియమింపబడటానికి ముందు ఒక ఉన్నత పదవిలో కొనసాగుతున్న రోజులవి. ఒకనాడు ఒక వ్యక్తి వచ్చి ఆ రోజుల్లో లక్షరూపాయలు లంచమిస్తానని ఈ ఆపదనుండి నన్ను నీవే రక్షించగలవని ప్రాధేయపడతాడు. సర్ శీతల్వాడ్ చిత్తు కాగితం ముక్కను విసరినంత తిరస్కారభావంతో లంచాన్ని ప్రక్కకు నెట్టి, ఆ వ్యక్తిని బయటకు

గెంటివేస్తాడు. జీవితంలో మీరెప్పుడూ ఇంత మొత్తాన్ని కళ్ళచూసే అవకాశంగానీ, ఈ విధంగా లంచం ఇవ్వగల సంపన్నుడైన వ్యక్తిగానీ నీకు తటస్థపడరని ఆ వ్యక్తి హెచ్చరిస్తూ మరోసారి ప్రలోభపెట్ట ప్రయత్నిస్తాడు. సర్ శీతల్వాడ్ నవ్వి, "నాయనా! ఇటువంటి లంచగొండులు, ఇంతకంటె పెద్దమొత్తాలు లంచంగా ఇచ్చేవాళ్ళు చీమలు దోమలు కంటె ఎక్కువ మందే పుట్టుకొస్తారు. కానీ సమాజదేవత కోరుకొనేది ఈ విధంగా తిరస్కరించగల వ్యక్తులను మాత్రమే! కాబట్టి నన్ను నన్నుగా ఉండనీ. దయ ఉంచి తొందరగా ఇచట నుండి కదల" మని గర్జిస్తాడు.

ప్రలోభాలు పరీక్షల మధ్య కాస్తకూడా చలించకుండా నిలబడగల సత్సాహసం, పరాక్రమం, మానవతావాదం ఇవి విస్మరించబడిన చోట ఇంక మిగిలిన దేముంది ? శుద్ధ శూన్యం తప్ప. మానవునికి ఉండవలసిన ఆదర్శాలు కరువైన తర్వాత, ఆ వ్యక్తి గొప్ప విద్వాంసుడే అయినా, సంపన్నుడే అయినా, అత్యంత శక్తివంతుడే అయినప్పటికీ ఎందుకూ పనికిరాని జీవచ్ఛవమనే గుర్తించండి. మానవుని యొక్క **కీర్తి, గౌరవం,** సన్మార్గంలో పయనించటం వలన, ఆ దారిలో తన వెనుక వచ్చే వారికి వెలుగు రేఖలతో దారి స్పష్టంగా కనుపించేటట్లు ప్రకాశాన్ని వెదజల్లటం వలన మాత్రమే దినదినాభివృద్ధి చెందుతాయి.

**కథ 67 : మ**హారాణి అహల్యాబాయి న్యాయనిష్ఠ గల వ్యక్తి. ఈమె న్యాయనిష్ఠ పట్ల ప్రజలకు దృఢవిశ్వాసం ఉన్నప్పటికీ, ఇండోర్ ప్రజలు ఆమె పుత్రుని దుర్మార్గం గూర్చి ఆమె ఎదుటకు వెళ్ళి ఫిర్యాదు చేయటానికి సాహసించలేకపోయే వారు. అతని దుర్మార్గం మితిమీరి చివరకు ఒక రోజు కోపంతో ఒక వ్యక్తిని హత్యచేస్తాడు. ప్రజలకు తప్పనిసరై అహల్యాబాయితో ఆమె పుత్రుని అత్యాచారాల గురించి ఫిర్యాదు చేయవలసి వచ్చింది. ఈ విషయాన్ని విన్న అహల్యాబాయి పుత్రప్రేమను ప్రక్కకుతోసి నియమానుసారంగా వెంటనే అతనికి మరణదండన విధించింది. వేళ్ళమీద మాత్రమే లెక్కపెట్ట తగిన ఇటువంటి సత్యనిష్ఠులైన వ్యక్తుల గురించి ఇలాంటి సందర్భాల గురించి విన్నప్పుడు అంధకార బంధురమైన ఈ సమాజంలో అవినీతికి విరుద్ధంగా పోరాటమంటూ ప్రేరణా ప్రకాశాలు వ్యక్తులలో తప్పక జాగృతమై తీరుతాయి.

**కథ 68 : ఒ**కసారి కాశీలో గంగా స్నానానికి వెళ్ళి ఒక వృద్ధుడు కాలుజారి పడిపోతాడు. ఇది ఒక యువకుడు చూచి వెంటనే గంగలోకి దూకి మునిగిపోతున్న వృద్ధుని రక్షిస్తాడు. ఎంత బ్రతిమాలినా తానిచ్చే బహుమానాన్ని స్వీకరించని యువకుని ఔదార్యానికి వృద్ధుడు సంతోషించి చివరకు తన చిరునామా ఇస్తూ ఎప్పుడు అవసరం కల్గినా తప్పక వచ్చి తన సహాయాన్ని పొందమని తెలియజేస్తాడు. కొన్ని నెలల తర్వాత యువకుడు ఒకరోజు వృద్ధుని ఇంటికి వెళ్ళి కొన్ని నిమ్నస్థాయి కవితలు అతని ముందుంచి వీటిని మీరు నడుపుతున్న పత్రికలో ప్రచురించి పెట్టమని అర్థిస్తాడు. కానీ ఆ కవితలు వాటి స్థాయిని చూచి వృద్ధుడు దిగ్భ్రాంతి చెంది నీవు చేసిన ఉపకారానికి బదులుగా నన్ను తిరిగిగొనిపోయి ఆ గంగలో పడవెయ్యి. అంతేగానీ ఇటువంటి నిమ్నస్థాయి కవితలు ప్రచురించి సమాజాన్ని పాడుచేయలేనని బాధతో తెలియచేస్తాడు. ఆదర్శవాదం, సైద్ధాంతిక నిష్ఠ అంటే ఇదే. ఇటువంటి వ్యక్తులు జీవిత వ్యాపారంలో నూటికి నూరుపాళ్లు సాఫల్యాన్ని పొందుతారు.

**శ్లో॥ శరీరం బలమున్నేతుం సంయమః సాధనాపిచ ।**
**కర్తవ్యే ర్థితమే తచ్చ మనోబలమపి దృఢమ్ ॥**
**సత్యస్య నికషే సిద్ధం ప్రతిపాదన మస్తియత్ ।**
**అస్వీకార్యమిదం నూనం భవత్యేవ మహామునే ॥**

**జీవన సాఫల్యానికీ, సార్థక్యానికీ రాచబాట సన్మార్గం.**

ఇక్కడ మహర్షి సత్సాహసం జాగృతం కావటానికి మూడు రకాలైన సాధనలను గూర్చి వివరించటం జరిగింది. **(1) సంయమనం వల్ల శరీరం బలం, (2) సత్యనిష్ఠ వలన వాస్తవం పట్ల ఇటూనిటూ ఊగక అచంచలంగా నిలబడగల్గటం; తద్వారా మనోబలం వృద్ధిచెందుట, (3) అవాంఛనీయతకు అవినీతికి ఏ మాత్రం సహకరించకుండా ఉండటం వలన ఆత్మబలం పెంపొంది** – ఈ విధంగా శరీర, మనో, ఆత్మ బల సంపన్నులు కావటానికి ప్రత్యేక సాధన దానంతటే అదే జరుగుతుందనీ మహర్షి పేర్కొనటం జరిగింది.

వ్యక్తికి శరీరదార్ఢ్యం అత్యంత అవశ్యకమైనది. అలాగే భ్రాంతుల నివారణకు మనోబలం తప్పనిసరి. సైద్ధాంతిక క్షేత్రంలో స్థిరంగా నిలబడగల్గటానికి ఆత్మబలం అనివార్యం. ఈ మూడు శక్తుల కొఱకు సాధనచేసి వీటిద్వారానే వ్యక్తి తన జన్మను సార్థకం చేసికొవటమేగాక పునర్జన్మవైపు కూడా తన పయనాన్ని సాఫీగా సాగించుకోగల్గుతాడు.

స్వామి దయానంద, స్వామి రామతీర్థ, స్వామి వివేకానంద వీరిని ముఖ్యంగా ఈ మూడు సాధనల దృష్టితో అత్యంత సమర్థులుగా పేర్కొనటం జరిగింది. సమాజంలో వ్యాపించిన అంధవిశ్వాసాలకు ఖండించటానికై వీరు తాము ఆర్జించిన తపోశక్తిని పూర్తిగా వినియోగించారు. **బ్రహ్మచర్యం ద్వారా ఆర్జించిన శరీర బలాన్ని, శాస్త్రజ్ఞానం ద్వారా ఆర్జించిన మనోబలాన్ని, తపస్సుద్వారా పొందిన ఆత్మబలాన్ని** ఈ ముప్వురు మహాపురుషులు అవినీతితో పోరాడటానికి, అవాంఛనీయతను రూపుమాపటానికి పూర్తిగా వినియోగించి **"విశ్వంవిష్ణుః"** అన్న వేద వాక్కును ఆచరణ ద్వారా చూపించారు.

శరీరబలం దృష్టితోచూస్తే గాంధీజీ చాలాబలహీనంగా కనిపించేవారు. కానీ ఆయన అహింసావాదం ఆయనను లోహపురుషునిగా మార్చివేసిరిది. 1923లో గుజరాత్‌లో ఒక జిల్లాలో ప్రాంతీయవాదం చెలరేగుతున్నప్పుడు కొందరు సోదరులు అక్కడినుండి పారిపోయి వచ్చి, ఆక్రమణకారుల అత్యాచారాల గురించి గాంధీజీకి అనేక పిర్యాదులు చేశారు. అంతా శాంతంగా విని, అయితే మీరు అవినీతిని ఎదుర్కొనటానికి చేసిన ప్రయత్నాలు యేమిటో చెప్పమని గాంధీజీ తిరిగి ప్రశ్నించారు. మీ అహింసావాదం మా కాళ్ళూ చేతులు కట్టివేసిందని, మేమేమీ చేయలేదని వారు పల్కటంతో గాంధీజీ ముఖం రోషంతో ఎఱ్ఱబారింది. **అహింసా వాదమంటే అవినీతి, అత్యాచారాన్ని వెంటనే అరికట్టడం.** వారు యే సాంప్రదాయానికి చెందిన వారైనా వెంటనే వెళ్ళి అవినీతి పరుల ముఠాపై తిరుగుబాటు చేయండి అని కఠినంగా పల్కడంతో వారు తమ తప్పు తెలిసికొని తిరిగి వెళ్ళిపోయారు.

**కథ 69 : మ**హారాణా ప్రతాప్ అనేకసార్లు ఆక్రమణదారుల బారినపడి నిరాశా నిస్పృహలకు గురికావలసి వచ్చింది. అటువంటి అనేక సందార్భాలలో ఆయన సతీమణి అతనిలోని ఆత్మబలాన్ని మేల్కొల్పడం జరిగింది. ఆత్మశక్తి యొక్క ఈ జాగరణే చివరివరకూ ఆయనను కర్తవ్యనిరతునిగా పోరాటం సాగించేందుకు వివశుణ్ణి చేసింది. ఒకనాడు ఈయన వనాలలో కుటుంబ సమేతంగా తిరుగుతూ, తినటానికి యేమీ లభించక చిన్న బిడ్డలు ఆకలితో అల్లాడడం చూచి హృదయం ద్రవించి ఆతనిలోని పౌరుషం, సాహసం సన్నగిల్లగా శత్రువులతో సంధి చేసికొని ప్రశాంతంగా జీవించటమే మంచిదేమోననే ఆలోచనలు కల్గసాగేయి. భర్త మానసిక స్థితిని అవగతం చేసికొన్న రాణా భార్య భర్తనుద్దేశించి, "నాథా! జీవితంలో **కర్తవ్య నిష్ఠను మించిన ఉత్కృష్ఠమైనది మరేదీలేదు.** సంతానంపట్ల మోహంతో దానిని అమ్ముకోవద్దు. ఈ ఒక్క బిడ్డేకాదు, మీ పూర్తి కుటుంబం ఆకలితో మరణించినా సరే పరవాలేదు గానీ, ఈ కుటుంబ రక్షణకోసం నీ కర్తవ్య నిష్ఠను అమ్ముకోటానికి

**ఎన్నడూ నిరాశ చెందనివాడే నిజమైన సాహసి.**

మాత్రం దిగజారవద్దని" హెచ్చరిస్తుంది. తేజోవంతమైన ఈ వాక్కులు, క్షీణించిన అతని శౌర్యాన్ని జాగృతం చేయగా భార్యవంక కృతజ్ఞతతో చూస్తూ, "దేవీ! నీ వాక్కులు సత్యమైనవి, శాశ్వతమైనవి. సౌకర్యమైన జీవితాలను తుచ్ఛులు, నీచులు కూడా జీవించగలరు. ఇది యేమంత పెద్ద విశేషం కాదు. కానీ కర్తవ్యపథంలో ఉత్కృష్ట మానవులు మాత్రమే అచంచలంగా నిలువగల్గుతారు. ఇటువంటి పరిస్థితులు వారికి పరీక్షా సమయాలు" అని పలికి ఇనుమడించిన ఉత్సాహంతో స్వతంత్ర సంగ్రామాన్ని సాగించటానికి సన్నాహాలు చేయటంలో నిమగ్నమవుతాడు.

**శ్లో॥ యాంతిసాహసికా హ్యగ్రే సఫలాః సపరాక్రమాః ।**
**భవంతి ప్రతికూలాభిః స్థితిభిర్యుద్ధ మాచరేత్ ॥**
**అనీత్యా యుధ్య మానైర్హాని లాభౌతు గణ్యతామ్ ।**
**ప్రఖరతాయా వినాశోఽపిక్షేత్రే కుత్రాపి ప్రోద్భవేత్ ॥**
**పరాక్రమః శ్లాఘనీయః సార్థసాహసికై ర్భవేత్ ।**
**సౌజన్యం శోభతే స్ఫీతం జాయతే సాహసేన చ ॥**

**అ**వినీతితో ఢీకొనవలసి వచ్చినపుడు హాని, లాభాలగూర్చి ఆలోచించకుండా ప్రతికూల పరిస్థితులలో సహితం చొచ్చుకొని పోగల్గటం సాహసవంతులకు వెన్నతో పెట్టిన విద్య. ఏమి ఉన్నా ఉత్సాహం, సాహసం కరువైన నాడు వ్యక్తి యేరంగంలోను ముందుకు పోలేడు. ఈ లోకంలో కొనియాడదగిన వాటిలో పరాక్రమం ప్రధానమైనది. సాహసవంతుని చుట్టూ అనేక సంపదలు, అనేక శక్తులు, అనేకమంది మిత్రులు వచ్చిచేరెదరు. సాహసం వల్లనే సజ్జనత్వం యొక్క శోభ వెదజల్లబడుతుంది. వీరి జీవనక్రమం యేవిధంగా ఉంటుందంటే

**"లీక్‌లీక్ గాడీ చలే లీక్ హే చరే కపూత్ ।**
**బినా లీక్‌కే ఏచలే షాయర్ సింహసపూత్ ॥"**

గాంధీ బ్రిటీష్ వారిని ఎదుర్కొంటూ గూడా మహాత్మా అనే నామానికి తగిన సజ్జనత్వంతోనే జీవితం గడిపేవాడు. సామ్రాట్, వైశ్రాయంతటి వాడు గాంధీజీ కన్నుల్లోకి సూటిగా చూడలేనంత పవిత్రత ఆయనలో ఉండేది. గోపాలకృష్ణ ఘోఖలే, తిలక్, పటేల్, లాలాలజపతిరాయ్, గణేశ్‌శంకర విద్యార్థివంటి అనేకమంది మహామానవులు వారి పవిత్రతకున్న శక్తి వల్లనే తాము కీర్తివంతులై తమ మాతృభూమిని దాస్య శృంఖలాల నుండి విడిపించి, ఆదర్శం యొక్క ఉన్నత శిఖరాల చివరి అంచులు చేరుకోగలిగారు. ఈ సజ్జనత్వం **ద్వారా** శోభించి పరిపుష్టమయ్యే **ఆధ్యాత్మగుణ సంపదే సత్సాహసంగా** పేర్కొన బడింది.

శ్లో॥ దుర్వాసాసు మహర్షిః సమన్వితానాం సమర్థనమ్ ।
స్మృత్వాస్వానాం ప్రసన్నో భూద్వివశో చింతయేయత్తథా ॥
క్రోధావేశోచ్చ ఏంగుః స్యాన్నరో న్యాం భిక్షయేత్కిము ।
వికృతో జాయతే సిద్ధం: కిం పరాన్ సాధయేదహ ॥
సంశోధన విధౌ భావం గృహీత్వా సర్వదైవతు ।
చికిత్సకస్య రుగ్ణస్య సిద్ధం పరుష మాచరేత్ ॥

**మ**హర్షి యొక్క ప్రతిపాదనలను శ్రద్ధతో ఆలకించిన దుర్వాసమహర్షి ప్రసన్నుడై ప్రఖరతయొక్క

**గుండెలోని భావాన్ని చెప్పని మాట వట్టి కళేబరం.**

పాశస్త్యాన్ని అవగతం చేసికొన్నాడు. కానీ ఆ ప్రఖరత ఆవేశంతో కూడినదిగాక, పవిత్రతతో నిండి ఉండాలి. సంస్కరించవలసిన వ్యక్తి తానే ఆవేశానికి గురియైతే ఇంక అతను ఎవరిని ఉద్ధరించగలడు? అలాగే అతని మాటలకు మాత్రం విలువ యేముంటుంది? సంస్కర్త వైద్యునివలె అనునయ, వినయాలను కల్గిఉండి సత్పరామర్శగావిస్తూ అవసరాన్ని బట్టి కటువుగా చేదుమందు మింగించే వానివలె ప్రవర్తించాలి. సన్నిహిత స్థితిలోనున్న రోగియేమేమి మాట్లాడినప్పటికీ వైద్యుడు అడ్డుచెప్పడు, తప్పు పట్టడు, బాధపడడు. అలాగుననే అవసరాన్ని బట్టి కాఠిన్యత వహించటంలో యే మాత్రం జంకడు. అందుకని వ్యక్తిలో సజ్జనత్వం, తీక్షణత రెండూ ఒకదాని వెంట ఒకటి కలసి పయనించాలి.

**కథ 70 : రా**వణుడు యుద్ధభూమిలో కటువచనాలు పలుకుతున్నా రాముడు మౌనంగా చిరునవ్వుతో వినటంచూచి విభీషణుడు ఆశ్చర్యంతో "ప్రభూ! మీరు శస్త్రాలను ఎందుకు ప్రయోగించరు? అతని కటువాక్కులపై శస్త్రాల నుపయోగించండి" అని తొందర చేస్తాడు. రాముడు శాంతంగా, "విభీషణా! అసలైన క్షత్రియుడు మృతులపై అస్త్ర శస్త్రాలను ఉపయోగించరాదు. ఆవేశగ్రస్తులు మరణించిన వారివలె జ్ఞానశూన్యులై యుంటారు. రావణుని పరిస్థితి కూడా ప్రస్తుతం అటువంటిదే" నని బదులు పలుకుతాడు.

**కథ 71 : చం**డకౌశికుడనే ఆయన ప్రచండమైన తపస్సు చేస్తాడేగాని, కోపాన్ని మాత్రం జయించలేక పోతాడు. ఒకనాడు ఆయన కాలిక్రింద ఒక కప్పపడి మరణించగా, తోటి తపస్వి ఆ సంగతి చెప్పటంతో మండిపడి కొట్టడానికి అతన్ని తరుముకొని వెళ్తాడు. కోపంలో అంధుడై దారిలో ఒక పెద్ద గోతిలో పడి మరణిస్తాడు. మోహ వశాన అతడు తిరిగి అదే ఆశ్రమంలో జన్మించి, సాధనవలన ఆశ్రమ వ్యవస్థాపకుడౌతాడు. అయినా అతనిలోని క్రోధం మాత్రం యథాతథంగానే ఉంటుంది. ఒకసారి భక్తుల పూజాసామాగ్రులలోను, ప్రవర్తనలోను, కొద్దిపాటి లోటుపాట్లను గమనించి కోపంపట్టలేక దండించబోతాడు. భయపడి వారు పారిపోగా క్రోధంతో వారిని వెంబడించి క్రోధావేశం వలన మార్గంలోని పాడునుయ్యి కానక మరల దానిలో పడి మరణిస్తాడు. మూడవసారి కూడా అతని జన్మ ఆశ్రమ ప్రాంగణంలోనే విషసర్ప శరీరంలో లభిస్తుంది. మార్గాన పోతున్న వారందరిని వెంబడించి కాటువేసి ప్రాణాలను హరించసాగేడు. ఒకసారి మహాత్ముడైన మహావీరుడు కూడా ఇతని కోపానికి బలి అవుతాడు. కరుణాస్వరూపుడైన మహావీరుడు కాటువేసిన సర్పంపై కాస్తయినా కోపించక అనంతమైన కరుణతో ఆ క్షుద్ర ప్రాణిని ఆదరించి ఆశ్రమ వాసులందరూ చంపటానికి ఉద్యమించినా వారిని వారించి అడ్డుపడతాడు. సర్పయోనిలోననున్న చండకౌశికుడు మహావీరునిలోని ఆ కరుణకు పశ్చాత్తాపంతో దహించుకు పోతాడు. ఆయన ఉపదేశాలను ఆయన ప్రక్కనే ఉండి వింటూ చివరకు ముక్తినొంది తిరిగి మానవుడుగా జన్మించి, వెంటనే కోపాన్ని జయించటానికై ఘోరతపస్సు నాచరిస్తాడు. ఆవిధంగా ఆయన సిద్ధపురుషుడై **క్రోధం అత్యంత హానికరమైనదని** ప్రబోధించటం మొదలుపెడతాడు.

**కథ 72 : ఒ**క అడవిలో ఒక సింహం నివసించేది. ప్రకృతి నియమాలను ధిక్కరించి అహంకారంతో విర్రవీగేది. అడవిలో జంతువులన్నీ భయంతో ప్రాణాలను చేతపట్టుకొని జీవించేవి. బుద్ధి బలంగల ఒక నక్క దీనిని హతమార్చ దలచి గుహకు దగ్గరలో ఒక చిన్న బిలాన్ని త్రవ్వుకొని దానిలో కూర్చొని స్వేచ్ఛగా సింహాన్ని తిట్టసాగింది. ఆ తిట్లువిని సింహం కోపంతో రెచ్చిపోయింది. కానీ ఆ బిలంలో దూరలేని కారణంగా అక్కడే కూర్చొని, నక్క ఎప్పుడు బయటకు వస్తుందా అని ఎదురు చూడసాగింది. నాల్గు రోజులైనా నక్క బయటకు రాకపోయేసరికి కోపం, ఆకలి దాహం వీటికి తాళలేక, తనకి తానే మరణించింది. క్రోధాన్ని మించిన శత్రువు

మరొకటి లేదు. కోపంతోనున్న వ్యక్తి తనను తాను మరచి అశక్తుడవుతాడు. ఆ స్థితిలో అతడిని అతి నిమ్న ప్రాణిగూడా సునాయాసంగా నాశనం చేయగలదు.

**కథ 73 : ఒ**కసారి బుద్ధభగవానునితో ఆనందుడు, "స్వామీ! మనం ఎక్కడికి వెళితే అక్కడ విరోధులే ఎదురవుతున్నారు. వారిని ఎలా ఎదుర్కోవాలో అర్థం కావటం లేదని" బాధను వ్యక్తం చేస్తాడు. దానికి బుద్ధుడు ఆనందునితో, "వత్సా! విరోధులనేవాళ్ళు సాధారణంగా తిట్టిపోస్తూ ఉంటారు. అయినా పట్టించుకోకుండా సాగిపోతూ ఉంటే ఆ ఉపేక్షను భరించలేక కొడతారు. కానీ మనం పరిపూర్ణమైన ఆత్మబల సంపన్నులమైతే మన సత్సంకల్పాలపట్ల దృడంగా నిలబడి, శాంతంగా ముందుకు సాగగల్గిననాడు విరోధులు తప్పక శాంతించి వెనుకంజ వేస్తారు" అని హామీ ఇస్తాడు. ఈ పవిత్రమైన వాక్కులు అనేకమంది శిష్యుల మనోబలాన్ని మేల్కొలుపుతూ ఉండేవి. వారు శత్రువుల మధ్యకు కూడా సాహసంతో ఉరికి, సత్కర్మాచరణ కావించగల్గేవారు.

**శ్లో॥ సమాప్తం పంచమం సత్రం తదారణ్యక మధాత్రతే ।**
**శ్రోతారో బ్రహ్మవిద్యాయ మహత్వం మేనిరే భృశమ్ ॥**
**ప్రతిపాదితం తయా యచ్చ తదాధ్యాత్మిక వైభవం ।**
**గరిమా పంచశీలస్య సావధానైర బుద్ధయత్ ॥**

**ఆ**రణ్యక శిబిరం యొక్క ఐదవరోజు పూర్తి అయినది. శ్రోతలు బ్రహ్మవిద్య యొక్క విశిష్ఠతను, దాని ద్వారా ప్రతిపాదించిన ఆధ్యాత్మిక పంచశీల సూత్రాల యొక్క స్థాయిని ధ్యానపూర్వకంగా విని అవగతం చేసుకొన్నారు. వారు ఆధ్మాత్మికతను, ఆస్థికతను, ధార్మికతను, కర్తవ్య పరాయణతను, ఉదారభక్తి భావనను అవినీతికి విరుద్దంగా పోరుసాగించటాన్ని వ్రతాలుగా భావించి, వ్రతశీలురై దేవ సంస్కృతియొక్క ఈ ప్రతిపాదనల తేజస్సును ఇంటింటా ప్రకాశింప చేయాలని ప్రతీ హృదయంలో ప్రతిష్ఠింప చేయాలని సంకల్పాన్ని తీసికొని పరివ్రాజకులై బయలుదేరటానికి సన్నద్ధమయ్యేరు.

ఈ విధంగా శిబిరం ఫలవంతంగా పరిపూర్ణమయ్యింది.

**ఇతి శ్రీమత్ ప్రజ్ఞాపురాణే శ్రీ పిప్పలాద దుర్వాస ఋషి సంవాదే**
**"పరాక్రమ - ప్రతిరోధ సాహస - సంఘర్షశ్చే" ప్రకరణోనామ షష్ఠోఽధ్యాయః ॥**

## ప్రజ్ఞా పురాణం

# యుగాంతరీయ చేతన - లీలాసందోహ ప్రకరణం

శ్లో॥ ఉమాశంకర సంవాదామరాం శృత్వా కథాం తు యః ।
నివృత్తో జన్మమృత్యుభ్యాం శుకకాయా నివాసకః ॥
వైశంపాయన ఏకస్మిన్ దినే- గాన్మేరు పర్వతం ।
మహాలయైక శేషం తం మార్కండేయం సభాజితుమ్ ॥

చిలుక దేహంతో మహర్షి వైశంపాయనుడు శివపార్వతుల సంవాదాన్ని వినటం సంభవించింది. ఆ తత్వజ్ఞాన శ్రవణమే అతడిని జరామరణాలు లేనివానిగా చేసింది. ఈ దేహం మార్పుచెందుతూ ఉన్నా వ్యక్తిలోని ఈ బ్రహ్మజ్ఞానం మాత్రం శాశ్వతంగా ఉండిపోవటం తథ్యం.

మహాప్రళయం సంభవించి జగత్తు మొత్తం సర్వనాశనమైనప్పుడుకూడ ఏ మాత్రం చలించక యథాతథంగా జీవయాత్ర సాగిస్తున్న చిరాయువుగల మార్కండేయునితో సుమేరు పర్వతం మీద వైశంపాయనుని యొక్క సమాగమం జరిగింది. తన శీలసంపద, పరమార్థ పరాయణత్వం ద్వారా ఘోర తపస్సు ఆచరించి భగవానుడైన శంకరుని ద్వారా మార్కండేయుడు వరాన్ని పొంది భూతభవిష్యత్ వర్తమానాలు ఎరిగిన వాడై పురాణాలకు ఆచార్యత్వం వహించిన విషయం సర్వవిదితమే.

**ప్ర**ళయానికి అర్థం మహా వినాశనం. ఖండప్రళయం అనేక కల్పాలలో సంభవిస్తూ ఉన్నదే. మానవుని అప్రమత్తుణ్ణి చేయటానికి, సన్మార్గం లోనికి లాక్కొని రావటానికి భగవానుడు పన్నే మాయయొక్క వైభవమే ఈ ప్రళయం. అత్యంత భయానకమైన ఇటువంటి విపత్కర పరిస్థితులలో కూడా దేవాత్మలు మాత్రమే జీవించియుండి వినాశనం తర్వాత తిరిగి సృష్టి కార్యక్రమాన్ని చేపట్టి, ముందుకు నడిపిస్తూ ఉంటాడు. వినాశనాన్ని సృష్టించిన దైవమే ఆ తరువాత పునఃసృష్టిని గూర్చి తహతహలాడుతూ ఉంటారు. అందుకే ఈ దివ్యాత్మలు దైవ నిర్ణయానికి అనుగుణంగా నియామకారులవుతూ ఉంటారు. బ్రహ్మ ప్రళయ కాలంలో సృష్టిబీజాలను జాగ్రత్తగా రక్షిస్తాడు. ఎందుకంటే వాటిద్వారానే ప్రళయం తర్వాత తిరిగి తన ప్రజాపతి పదవీ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించి సృష్టిని కాపాడగల్గుతాడు.

**రా**వణుని అతని రాక్షసత్వాన్ని భగవంతుడు స్వయంగా సంహరించివేసినా విభీషణు నొక్కడిని మాత్రము రక్షించటం జరిగింది. విభీషణుడుకూడా చిరాయువు గలవాడని పురాణాలు పేర్కొంటున్నాయి. మహాభారతయుద్ధం నాశనం యొక్క రూపుదాల్చి అధిక సంఖ్యలో ప్రజలు మరణించినా, శ్రీకృష్ణునికి తమను తాము సమర్పించు కొన్న పాండవులు మాత్రం జీవించి ఉండటం జరిగింది. ఇది అనాదిగా సాగుతున్న సృష్టిక్రమం.

**మ**హర్షి వైశంపాయనుడు, దివ్యాత్మ స్వరూపుడైన మార్కండేయుడు, యుగాంతర చేతనత్వం సందర్భంగా ఒకరినొకరు కలుసుకొని పరమార్థ చర్చ జరపటమనేది కూడా యుగయుగాలుగా ఋషిగణాల మధ్య సాగుచున్న రహస్యలీలయే. ఈ సమావేశాల ద్వారా వారు అదృశ్య జగత్తుయొక్క భూతభవిష్యద్వర్తమానాల గతివిధులను పర్యవేక్షించి, విశ్లేషణ గావించి, యే విధంగా కార్యరూపంలో పెట్టాలో నిర్ణయ నిర్ధారణలు చేస్తూ ఉంటారు.

వైశంపాయునుడిలా ప్రశ్నించారు.

**శ్లో॥ ప్రజ్ఞాయుగ సమారంభే - మంత్రణాతిమహత్వగా ।**
**విష్ణునారద యోర్మధ్యే జాతామంగళదా నృణామ్ ॥**
**యోజనా నిశ్చితాసైకా నీతిర్నిర్ధారిఉ_తాభవత్‌।**
**ఇత్యేవ జ్ఞాతం తత్రాగ్రే కిమభూద్ విదితం నహి ॥**
**త్రికాలజ్ఞో భవాంస్తత్ర సందర్భే విశ్వమంగళే ।**
**ఆద్యావ దిహ్యభూత్ కించ భావ్యగ్రే కృపయావద ॥**

**దే**వా! ప్రజ్ఞాయుగం యొక్క శుభారంభంలో దేవఋషియైన నారదుడు, భగవానుడైన శ్రీకృష్ణుడు - వీరిద్దరి మధ్య మానవ కల్యాణ కారకమైన గుప్తమంత్రణ జరిగింది. తద్వారా ఒక ప్రణాళిక వేయబడి ఒక నీతి నిర్ధారించబడిందని మాత్రం అవగతమయింది. కానీ ఆ ప్రసంగంయొక్క భవిష్య ప్రణాళిక యేమిటి అనే విషయం మాత్రం మాకు తెలియలేదు. మీరు సర్వజ్ఞులు. త్రికాల జ్ఞానమెరిగిన వారు. కావున ఆ మంగళకరమైన సందర్భాన్ని విశదీకరించి ఇంతవరకూ ఒరిగిన దేమిటో మరొక్కసారి సెలవిస్తూ, ముందు జరగబోయేదాన్ని కూడా వివరించమని వైశంపాయనుడు తన జిజ్ఞాసను మార్కండేయ ఋషిముందు వ్యక్తపరుస్తూ ప్రజ్ఞావతార లీలా ప్రకరణయొక్క విస్తరణను, మహాకాలుని ద్వారా ప్రణాళికా బద్దంగా రూపొందించబడిన కార్య పద్ధతిని, భవిష్యత్ కార్యక్రమాలను తెలిసికోవటానికి చేసిన ప్రయత్నం ఇక్కడ విశదీకరించబడింది.

**శ్లో॥ దేవత్మాస సమాకర్ణ్యా మార్కండేయో మహామునిః ।**
**జిజ్ఞాసాం ముముదేత్యర్థం దివ్యాందృష్టిం సమాశ్రయత్ ॥**
**తయా భూతం భవిష్యశ్చ దృష్టవాన్ ధ్యానపూర్వకం ।**
**తతో గంభీర ముద్రాయాం వాణ్యా సంస్కృతయా గదత్ ॥**

మార్కండేయ ఋషి ఇలా నుడివిరి.

**శ్లో॥ కాయయా అమర! వైశంపాయన! తంతుమహామునే ।**
**ప్రసంగం రోచకం చాపి మార్మికం శృణు ధ్యానతః ॥**

**ది**వ్యాత్మ స్వరూపుడైన మార్కండేయుడు వైశంపాయనుని జిజ్ఞాసను తెలిసికొని అత్యంత ప్రసన్నుడై దివ్యదృష్టి ద్వారా భూతభవిష్యత్‌లను అవలోకించి సమస్త విషయాలను తన సంస్కారవంతమైన వాణిద్వారా తెలియచెప్పటానికి ఉపక్రమిస్తూ ధ్యానమగ్నుడై ఇలా అన్నాడు. అమరుడా! మునీశ్వరా!! గంభీర మైనటువంటియు, అత్యంత ఆవశ్యకమైనటువంటియు, ఆసక్తికరమైన ఈ ప్రసంగాన్ని అత్యంత సావధానుడవై ఆలకించు.

ఋతువులు తమ చక్రీయగమనంలో తిరిగితిరిగి సంవత్సరం తరువాత యథాతథంగా మరల మొదలవుతూ ఉంటాయి. సూర్యుడు ఈ రోజు ఎక్కడ ఉదయిస్తున్నాడో సరిగ్గా 24 సంటల తర్వాత అదే స్థానంలో ఉదయించి తీరుతాడు. జీవుడు జన్మను పొంది అనేక అవస్థలలో పెరిగి పెద్దయై మరణించి, తిరిగి పునర్జన్మలో ఇదే స్థితులను క్రమం తప్పకుండా పొందుతూ ఉంటాడు. భూమి, గ్రహాలు, వాటి గతినిధులు ఇలాగే అనాదిగా, నడుస్తూ ఉన్నాయి. అసంఖ్యాకమైన పర్యాయాలు ఇదే క్రమం పునారావృతమవుతోంది. యుగ, మన్వంతర కల్పాలు కూడా వాటి క్రమాలను ఇదేవిధంగా పునరావృతం గావిస్తున్నాయి. సృష్టి, ప్రళయ చక్రం కూడా యథాతథంగా వీటన్నిటి వలెనే నడుస్తూ వస్తున్నదే. వ్యక్తులు, సంఘటనలూ తారుమారైనా చరిత్రకూడా ఇదే క్రమంలో నడుస్తూ, ప్రాచీన కాలంలో జరిగినవి, జరుగుతూ ఉన్నవి, సర్వం కూడా యథాతథంగా పునరావృతం అవుతూనే వున్నాయి.

సూక్ష్మదృష్టిగల ఋషిగణాలు తమ దివ్యచక్షువులతో భవిష్యత్తును వీక్షిస్తూ ఉంటారు. వాల్మీకి భవిష్యత్‌ని అవలోకించే రామాయణ రచన గావించాడు. సంజయుడు మహాభారత సంఘటనా వర్ణనలను తన దివ్యదృష్టితో ఈ విధంగానే వీక్షించి, వర్ణించటం జరిగింది. భగవానుని 24 అవతారాల గురించి శ్రీమత్ భాగవత పురాణంలో 11వ స్కంధంలో 11వ అధ్యాయంలో యథాతథంగా వర్ణించబడింది.

మహారాజైన **'నిమి'** యొక్క జిజ్ఞాసను తీర్చటం కోసం యోగీశ్వరుడైన ద్రుమిల మహర్షి తన దివ్యదృష్టితో ఆదిపురుషుని దగ్గర నుండి నిష్కళంక అవతారం వరకూ విశదంగా వర్ణించడం జరిగింది. వెనుకటి 23 అవతారాల గురించి చెప్పబడిన విషయాలు, ఇందలి సంఘటనాక్రమాలు, వివిధ కాలాలకు, కల్పాలకు, మన్వంతరాలకు అనుగుణంగా ఉన్నాయి. కానీ ప్రస్తుత సందర్భంలో త్రికాలజ్ఞాని, చిరాయువు గల్గిన వాడూ అయిన మార్కండేయుడు ప్రజ్ఞాయుగం యొక్క శుభారంభాన్ని, ఆ అవధిలో సంభవించే సంఘటనలను, జాగృతాత్మల త్యాగ నిరతని, వర్తమానంలోని కార్యకలాపాలను, భవిష్యత్తులో జరుగబోతున్న వాటిని ధ్యానమగ్నుడై దివ్యచక్షువులతో వీక్షించి తన **"అమృతవాణి"** ద్వారా వైశంపాయనునికి వినిపిస్తున్నారు.

**శ్లో॥ భగవతేర్పిత కాయః సదిచ్ఛా చింతకో మునిః ।**
**కర్తాతదనుసారం యో దేవర్షిర్నారదః స్వకామ్ ॥**
**భక్తి ప్రసారికాం భూతకాలికీమ్ కార్యపద్ధతిం ।**
**పరివర్తిత రూపాం స వ్యధాత్ కాలజ్ఞ ఆప్తవాక్ ॥**
**యుగధర్మానురూపస్య జ్ఞానస్యాపిచ కర్మణః ।**
**ఉత్కృష్టతా ప్రసారేచ విస్తరే నిరతోః భవత్ ॥**

దైవానికి తమను తాము సమర్పించుకొన్న వ్యక్తులు ఆయన ఇచ్ఛానుసారమే జీవయాత్ర సాగిస్తూ, సాగుతున్నదంతా ఆయన ఇచ్ఛానుసారమేనని తెలిసికొంటారు. అలాగే వారివారి కార్యకలాపాల ప్రణాళికనుకూడా తదనుగుణంగానే నిర్ధారించుకొంటారు. దేవర్షి నారదుడు కూడా ఇదే విధంగా యుగధర్మానికి తగినట్లు జ్ఞానం, కర్మయొక్క ఉత్కృష్టతలను వ్యాపింపచేయ సంకల్పించి, గతంలోని తన భక్తి ప్రచార కార్యక్రమ ప్రణాళికను కూడా మార్చుకొని, దైవేచ్ఛ కనుకూలంగా ఆలోచనలను, ప్రచారకార్య ప్రణాళికలను మార్చుకోటం జరిగింది.

**పాప సిద్ధాంతం మనకు లేదు.**

**సమర్పణ : చ**ందన వృక్షం దగ్గర మొలకెత్తి పెరిగే ప్రతీ మొక్కకూడా సుగంధ భరితమై, చందనం అమ్ముడు పోయిన ధరకే అమ్ముడు పోతూ ఉండడం సర్వవిదితమే. అలాగే నీరుకూడా పాల ధరకే అమ్ముడు పోతున్నాయి. పారసమణి స్పర్శతో నికృష్టమైన చవకబారు లోహాలుకూడా విలువైన బంగారు లోహం పొందే గౌరవాన్ని పొందుతున్నాయి. స్వాతివాన చినుకుల ద్వారా లాభాన్ని పొందటం వలన ఉపేక్షభావంతో చూడబడే ఆలుచిప్పలుకూడా విలువైన ముత్యాలను ఉద్భవింపచేయగల శ్రేయస్సుకి అధికారులవుతున్నాయి. నేలమీద ప్రాకి మట్టికొట్టుకు పోతున్న తీగ, వృక్షాన్ని ఆశ్రయించటం వలన తనను తాను చూసుకొని గర్వించటంతో ఉన్నతికి ఎదిగిపోతోంది. చెట్టు యొక్క సాన్నిధ్యం అల్లుకోవటమనే పురుషార్థంవల్ల, దౌర్భల్యం సునాయాసంగా దూరమై భగవదనుగ్రహం వంటి లాభాలకు అధికారం లభిస్తోంది. ఈ ఉదాహరణలన్నీ వివిధ విధాలుగా మనకు తెలియజేస్తున్నదేమిటంటే, భగవానుని కోర్కెతోపాటు వ్యక్తి తన కార్యక్రమాలను మేళవించ గల్గిననాడు. కోరకుండానే ఊహించని విధంగా అనంతమైన సౌభాగ్యం ఎట్టెదుట సాక్షాత్కరిస్తుంది.

భగవంతుడు సాంప్రదాయవాది కాదు. యుగం యొక్క అవసరాన్ని బట్టి ఆయన వివిధ రూపాలను ధరిస్తూ సమయానుకూలంగా మారుతూ ఉంటాడు. అవతార ప్రకటీకరణయొక్క అంతర్యం ఇదే. తన వలననే తన భక్తులను కూడా యుగ ధర్మాన్ని బట్టి వారి వారి కార్యప్రణాళికలను మార్చుకోవాలని ఆయన ఆశిస్తూ ఉంటాడు. భావాలను, ఆదర్శవాదాన్ని నెలకొల్పాలని సంకల్పించుకోవటం జరిగింది.

భగవంతుని భక్తి యొక్క స్వరూపంకూడా కాలానుగుణంగా పరివర్తన చెందుతూ ఉంటుంది. భక్తి అనేది అందరకూ అనివార్యమే. కాని కర్మ, జ్ఞానం లోపించిననాడు ఆ భక్తి వ్యర్థమవ్వక మానదు. జ్ఞానం వల్ల అజ్ఞాన జనితమైన భ్రాంతులు తొలగిపోతాయి. కర్మవల్ల దుఃఖం, దరిద్రం నివారించబడి, ఆదర్శం పట్ల వ్యక్తి యొక్క సమర్పణకు ఒక రూపం ఏర్పడి సాధనను సఫలీకృతం చేస్తుంది.

యుగధర్మాన్ని అనుసరించియే సమర్థగురు రామదాసు సన్యాసి వేషధారియై **"జై శ్రీ రఘువీర్ సమర్థ్"** అనే నినాదాన్ని చేస్తూ పోరాటాన్ని ఆహ్వానించి ఆగంతకులకు, ఆక్రమణకారులకు విరుద్ధంగా పోరు సల్పటానికి కావలసిన సామర్థ్యాన్ని సమీకరించాడు. నినాదాన్ని విని, ఛత్రపతి శివాజీతో సహా అనేక జాగృతాత్మలు ముందుకు ఉరికి, అపత్కాలంలో ధర్మాన్ని, సంస్కృతిని రక్షించగల్గేరు. భక్తి ఆనాడూ ఈనాడూ కూడా అవసరమే. కాని యుగాను కూలంగా దాని రూపం మారితీరాలి. **ఈనాడు వ్యక్తి ఆలోచనల్లో పేర్కొన్న భ్రష్టత్వం, అంతరంగంలో నిండిన అసురీతత్వం, నివారించాలంటే ఆదర్శవాదాన్ని ప్రచారం చేయటం తప్ప వేరే గత్యంతరం లేదు.** ఆదర్శం అంటే మరేదో కాదు. భక్తి యొక్క స్వరూపమే. గుహుడు నావదాటించి, శబరి ఎంగిలి పండ్లు తినిపించి, ఉడుత ఇసుకను దులిపి, జటాయువు రెక్కలను సమర్పించి తమ భక్తిని ప్రకటించుకొన్నాయి. అవన్నీ భగవంతుని పట్ల తమకు గల భక్తిని తెలియజేసికోటానికి ఒకే విధమైన భక్తి మార్గాన్ని ఎందుకు ఎంచుకోలేదు? అందరూ పండ్లిచ్చో, అందరూ ఇసుకనే దులిపో భక్తిని నిరూపించుకోవచ్చును కదా? అని ఎవరైనా ప్రశ్నిస్తే ఆ ప్రశ్నకర్త మూఢుడని భావిస్తాము. రెక్కలను సమర్పించవలసి వచ్చినపుడు ఇసుకదులిపే అతడిని, కాలంయొక్క అవసరాన్ని గుర్తించలేని వివేకహీనుడుగా భావిస్తాము.

**పాణిని** వ్యాకరణం వ్రాస్తే **పతంజలి** యోగ సూత్రాలను తెలిపాడు. **వ్యాసుడు** పురాణాలు వ్రాస్తే **చరకుడు** వనస్పతి జగత్తుని అన్వేషించాడు. **నాగార్జునుడు** రసాయన శాస్త్రాన్ని అనుసంధానం గావిస్తే

**నా అదృష్ట దురదృష్టాలకు బాధ్యుడను నేనే.**

**చాణుక్యుడు** రాజనీతిని లక్ష్యంగా పెట్టుకొన్నాడు. అలాగే **బుద్ధుడు, గాంధీల** అహింసావాదం కూడా భిన్నమైనదే గానీ ఒకటి కాదు. ఐనప్పటికీ యుగ పరివర్తన దృష్టితో వారి త్యాగనిరతిని సమానంగానే శ్లాఘించటం జరిగింది. **పరశురాముని** గొడ్డలి, **ధన్వంతరి** అమృతభాండము, ఆకృతి, ప్రకృతుల దృష్ట్యా పూర్తిగా భిన్నమైనవి. కాని లక్ష్యం అనేది ఒకటే. చైతన్య జగత్తులో సదా సమయం యొక్క అవసరాన్ని తీర్చి వీటికి తగిన నిర్ణయ నిర్ధారణలే పని జరుపుతూ ఉంటాయి. ఇలా కాక వీటిని ఉపేక్షించి పురాతనమైనవీ, శాశ్వతమైనవీ తగిన నిర్ణయ నిర్ధారణలే పని జరుపుతూ ఉంటాయి. ఇలా కాక వీటిని ఉపేక్షించి పురాతనమైనవీ, శాశ్వతమైనవీ అంటూ వాటినే పట్టుకొని వ్రేలాడేవారు మొండిపిల్లల మోస్తరుగా తల్లిదండ్రుల కోపానికి, శిక్షణకు గురికాక తప్పదు.

**శ్లో॥ మహా ప్రాజ్ఞన్య నంవన్నా పివ్పలాదన్య వంచవే ।**
**తత్వావధానే పూర్వం తు ప్రనంగాస్తాన్ మహామునే ॥**
**ఆదేయ ప్రజ్ఞా పురాణస్య ఖండే పూర్వం, న్యయోజయత్ ।**
**ప్రనంగన్య వృత్తాంతః వరిష్ఠైర్యుగ పూరుషైః ॥**

**ఓ** మునీశ్వరా! పిప్పలాద మహర్షి యొక్క తత్వబోధలో ప్రజ్ఞా శిబిరం యొక్క ఐదు రోజులలో ప్రజ్ఞా పురాణం యొక్క ప్రథమ ఖండాన్ని 5 ప్రసంగాలుగా నిర్మాణం చేసి, వరిష్ఠులైన యుగ పురుషుల ద్వారా ఈ ప్రసంగాలను వ్యక్తి వ్యక్తికి చేర్చటానికి సంకల్పాలు తీసికోబడ్డాయి. నవచైతన్యం యొక్క స్ఫురణ వీటి ద్వారా ప్రారంభమై తీరుతుందని మహర్షికి బాగా తెలుసు. సృష్టియొక్క కార్మిక చైతన్య రూపంలో **"ప్రజ్ఞాభియాన్"** కూడా ఈ ప్రయాసలోని భాగమే. దావానలంలాగ, ప్రచండమైన తుఫానులాగ ఈ ప్రయాస **ప్రజ్ఞాపురాణ** ప్రవచనాల ద్వారా వ్యాప్తి చెందసాగింది.

చైతన్య జగత్తులో ఉప్పొంగే పరివర్తన భగవత్‌శక్తి ప్రవాహంలోని భాగమే. స్వల్పంగానూ, సాధారణంగానూ కనిపించే ఈ పరివర్తన రాబోయే కాలంలో **యుగాంతర భూమికను** నిర్వహించి తీరుతుంది. ఈ విధంగానే సూక్ష జగత్తులో ప్రవహించే ప్రవాహపు ప్రక్రియలు కూడా సర్వవిదితమే. లోక ప్రవాహంలో అవాంఛనీయత యొక్క విషం నిండి ప్రవహించేటపుడు పతనం, పరాభవం వంటి విపత్తులు తల ఎత్తటం సహజం. వాటి నివారణ కూడా సూక్ష్మ జగత్తులో జరుగుతూ ఉంటుంది. ఈ తుఫాను యొక్క ప్రభావం వాతావరణాన్నంతటని తల్లక్రిందులు చేసేటంతటి శక్తిగల్గినది.

తుఫాను వచ్చినపుడు చిన్న చిన్న గడ్డిపోచలు కూడా ఆకాశం అంత ఎత్తుకి ఎగిరిపోతూ ఉంటాయి. పెద్ద పెద్ద వర్షాలు కురిసేటప్పుడు ఆ నీటి బిందువుల తాకిడికి శక్తివంతమైన భవనాలు కూడా కూలిపోతాయి. దావానలం యొక్క తీవ్రత సముద్రాన్ని సహితం వివశురాల్నిగా చేసి ఆవిరిగా మార్చివేస్తుంది. ఈ విధంగానే కాల ప్రవాహంతోపాటు ఎండుటాకులు, గడ్డిపోచలు వంటి మానవులు కూడా కొట్టుకొనిపోతూ ఉంటారు. వరద పొంగి ప్రవహించేటపుడు ఆ మార్గంలోని వృక్షాల కొమ్మలు, మొక్కలు వంగి ఉంటాయి. దీనినే ప్రవాహపు ఒత్తిడి అంటారు. మరోవైపు ప్రఖర ప్రతిభావంతుల సమిష్ఠి చైతన్యం ఇదే విధంగా వాతావరణ నిర్మాణానికి కారణమౌతుంది. **ఓజస్వి, మనస్వి, తపస్వి** స్థాయికి చెందిన ప్రతిభావంతులు తమ ప్రచండ తేజస్సుతో వాతావరణంలో వేడిని పుట్టిస్తారు. దీనివల్ల పరిస్థితుల ప్రవాహంలో అసాధారణమైన మలుపు

**నిస్సహాయులను ఉపేక్షించడం ప్రభువు పిలుపును నిరాదరించడమే.**

తిరిగి పరివర్తన వచ్చి తీరుతుంది.

సృష్టి యొక్క ప్రేరణ ఇటువంటి ప్రయాసలకే జన్మనిస్తూ వస్తుంది. భగవంతుడైన శ్రీరాముని ఆహ్వానం మేఱకు దేవశక్తులు **నల, నీల, వానర** రూపులు దాల్చి సేతు బంధనానికి కదలివచ్చాయి. అలాగే శ్రీకృష్ణునితో కలిసి ఈ దైవీశక్తులు గోవర్ధన పర్వతాన్నే ఎత్తించేలా చేశాయి. బుద్ధ భగవానుడు వివేకం, ధర్మం, సంఘటిత శక్తి వీటిని శరణు వేడటం కోసం జాగృతాత్మలనే ఆహ్వానించాడు. అవాంఛనీయ పరిస్థితులను రూపుమాపటానికి **యుగదేవత** పిలుపు మేఱకు బౌద్ధ భిక్షువుల విశాల సముదాయం ఆయన వెంట నడిచింది. ఇదే చరిత్ర ఈనాడు తిరిగి పునరావృతం కాబోతుంది. నేటి విధి విధానాలు అటువంటి సమిష్ఠి ప్రయాసల అభిన్న అంగములే.

**శ్లో॥ జాగృతాత్మ భి రాధారే తస్మిన్నా కరణ్య మంత్రణాం ।**
**యుగస్య జీవనం ఏషు శ్లథధంతే భవబంధనం ॥**
**కుర్వంతో యుగ ధర్మస్య నిర్వాహే నిరతాముదం ।**
**ఏకోదీపో హ్యనేకాం స్తాన్ దీపాన్ జ్వాలయతే క్షణాత్ ॥**

**మ**హాకాలుని పిలుపు విన్న తక్షణం జాగృతాత్మలు ఆత్మతత్వంమీద వ్యాపించియున్న సంకీర్ణ స్వార్థపూరిత కషాయ కల్మషాలను కడిగివేసికొని, యుగ దేవత యొక్క ఆహ్వానాన్ని ఆదరంతో స్వీకరిస్తూ, యుగధర్మ నిర్వహణకై ముందుకు ఉరుకుతాయి. ఒక్క దీపం అనేక దీపాలను వెలిగించినట్లు, చిన్న అగ్ని కణం పెద్ద పెద్ద అగ్ని జ్వాలలుగా మారి ఉష్ణాన్ని, వెలుగును ప్రసాదించునట్లు, అతి చిన్న విత్తనం మహావృక్షంగా మారి పలు లాభాలను కలుగజేసినట్లు మనం చూస్తూ ఉన్నాము. కానీ మానవుడొక్కడు మాత్రమే నా ఒక్కని వల్ల ఏమవుతుందిలే అని భావించి, భావనాత్మక కృపణతవలన **కాలదేవత మేల్కొల్పుని ఆలకించక, ఆలకించినా ఒకసారి ఆవలించి మళ్ళీ నిద్రలోకి జారుకొంటున్నాడు.** ఆమె ఆదరంగా వచ్చి ఎట్టెదుట నిలబడినా చూడనట్లు నటియించి, ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకొని మాయ యొక్క భవ బంధనాలలో పడి కొట్టుకుంటున్నాడు.

**కథ 1 : న**రపశువులు, దేవమానవులు అని మానవులను కూడా రెండు రకాలుగా నిర్ధారించటం జరిగింది. నరపశువులు శరీర సౌకర్యాలు, ఇద్రియ సుఖాలతో **"నేను", "నాది"** యని విఱ్ఱవీగుతూ సంపద, సౌకర్యం సర్వస్వంగా భావించి, అహంకారంతో భౌతిక జీవితానికి ప్రాధాన్యతనిచ్చి జీవిస్తూ ఉంటారు. పైకి వీరూ మనుష్యులుగానే కన్పించినప్పటికీ, వాస్తవం చెప్పాలంటే వీరిని జడకళేబరులని అనవలసి ఉంది. ఇక రెండవ వర్గానికి చెందిన దేవమానవులను **వరిష్ఠులని** అంటారు. వీరు తమ శ్రేష్ఠమైన వ్యక్తిత్వమే సర్వస్వంగా భావించి తమ పురుషార్థం ద్వారా ప్రతీ సమస్యను తమకుతామే పరిష్కరించుకొంటూ మిగిలిన పురుషార్థాన్ని పరులను ఉద్ధరించటానికి ఉపయోగిస్తూ ఉంటారు.

మానవులలో దేవతలను, నరపిశాచులను గుర్తించటం ఎలాగని ఒకసారి వివేకానందుడు పరమహంసను ప్రశ్నిస్తాడు. ఇతరులకు మేలు కల్గే పక్షంలో తమకు ఎంతటి హాని సంభవించినా భరించటానికి సిద్ధపడే వారిని **దేవతలని,** తమ మేలు తాము చూసుకొంటూ ఇతరులకు కూడా మేలు చేయాలని ఆశించే

**విత్తనం తాను భూమిలో నశించి మహావృక్షంగా మారుతోంది. త్యాగంలోనే ఉంది విజయం.**

వారిని **మానవులని,** ఇతరులకు ఎలా హాని కల్గుతుందా అని నిరంతరం ఆలోచిస్తూ, ఇతరులకు హాని కల్గే పక్షంలో తాము ఎంతటి ఇబ్బందులనైనా ఎదుర్కొడానికి సిద్ధపడే వారిని **నరపిశాచులని** పరమహంస వివేకానందునకు తెలియజేయటం జరిగింది.

**కథ 2 : మా**నవదేహంలో వ్యక్తి మూడు రూపాలతో నివసిస్తూ ఉంటాడు. **1. సత్పురుషుడు 2. సంస్కర్త 3. అమరవీరుడు.** వీరు సాధారణ మానవుల స్థాయికంటే అతి ఉన్నతమైన స్థాయికి చెందినవారు కావటం వల్ల వీరిని అవతార పురుషులుగా పేర్కొనడం జరిగింది. **సత్పురుషుడు** తన సజ్జనత్వంతో మానవ జీవితాలు సద్వినియోగ మయ్యేటందుకు తోడ్పడుతూ ఉంటాడు. **సంస్కర్త జన** జీవనాల చుట్టూ అల్లుకొని యున్న భ్రష్ఠ చింతనలూ, దుష్టాచరణల నివారణకు తన పరాక్రమాన్ని చూపిస్తూ ఉంటాడు. ఇంక **అమరవీరుడు** పరమార్థానికి తనను తాను పూర్తిగా సమర్పించి వేసికొంటాడు. **శరణాగతి** అంటే ఇదే. స్వార్థపూరితమైన భవబంధనాలన్నింటినీ త్రుంచి వేసుకొని తన లక్ష్యాన్ని విశ్వమంతటా వ్యాపింపజేసి ధర్మ సంస్కృతుల పునరుద్ధరణ కోసం ప్రాణాలను కూడా లక్ష్యపెట్టక తమను తాము పూర్తిగా అర్పించి వేసికొనుట అమరవీరుల ధ్యేయమై ఉంటుంది.

**ఒ**కానొకప్పుడు ముగ్గురు అసురులు సోదరులుగా జన్మించి మూడు మాయానగరాలను సృష్టించుకొని వారి గారఢీ విద్యలతో లోకాన్నంతను భ్రమింపచేస్తూ యధేచ్ఛగా జీవించేవారు. ప్రజలంతా వీరి మాయలలో చిక్కుకొనుటం వలన ధర్మం సమూలంగా నశించి, ఎటుచూసినా ఆధర్మమే తాండవమాడ నారంభించింది. ధర్మదేవత సహించలేక ప్రజాపతి వద్దకు వెళ్ళి మొరపెట్టుకొని దుఃఖించగా, ఆయన మహాకాలుడైన ఈశ్వరునికి ఈ పనిని ఒప్పగిస్తాడు. ఎందుకంటే పరివర్తనకు పరమేశ్వరుడే అధిష్ఠాన దైవం. విషయాన్ని విన్న పరమశివుడు పైకి వేరువేరుగా కన్పిస్తున్నా ఆ ముగ్గరు అసురులు ఒక్కటిగానే కలసి ఉన్నారని గమనించి, అలాగే ఒకే అస్త్రంతోనే ఆ ముగ్గురూ మరణించాలని కోరుతూ వరాన్ని కూడా సంపాదించియున్నారని తెలిసికొంటాడు. ఇందువలన ఆయన వీరిని సంహరించటం కోసం త్రిశూలాన్ని తయారుచేసి ముగ్గుర్నీ ఒకేసారిగా సంహరిస్తాడు. మహాకాలుని యొక్క దిగ్విజయ వార్త సర్వత్రా వ్యాపించి అభినందల వర్షం కురిపిస్తూ త్రిపురాసుర సంహరియని ఆనాటి నుండి పరమేశ్వరుని పిలవసాగేరు. ధర్మదేవతను దుఃఖింప చేసిన ఈ ముగ్గురు అసురులు వాస్తవానికి అసురులు కారు. **లోభం, మోహం, అహంకారం** అనేవి మాత్రమే.

**లోభం :** నీతిని విస్మరించి, అనవసర సేకరణ గావిస్తూ, ఇంద్రియాలను అదుపులో ఉంచక, విలాసంగా, యధేచ్ఛగా సుఖభోగాలను అనుభవించాలనుకోవటమే లోభం.

**మోహం :** ఇష్టమైన ఏ కొద్ది మంది వ్యక్తులనో, వస్తువులనో మాత్రమే తమవిగాను, తమ వారుగాను భావించటం మోహం.

**అహంకారం : త**న క్షుద్ర సంపదపట్ల గర్వించటం, అశాశ్వతమైన తనువును చూసుకొని విఱ్ఱవీగటం అహంకారం.

సంహరించవలసిన నిజమైన అసురులు వీరే. వీరికి లొంగి ఈనాడు మానవులు సర్వనాశనమై

**సద్గతిని పొందడానికి యత్నించు. దుర్గతిని అనుభవించడానికి సిద్ధపడు.**

నికృష్ణ జీవితాలు గడుపుతున్నారు. కొద్దిమంది వివేకవంతులు మాత్రం దూరదృష్టితో తమలోని ఆదర్శాలను వికసింప చేసికొంటూ, సాహసంగా ఈ ముగ్గురు అసురులతో పోరాడి వీరిని నశింపచేసి, తమ ప్రచండ పురుషార్థం ద్వారా ధర్మ దేవతను రక్షించగల్గుతున్నారు.

**శ్లో॥ కోటిశః కపి భల్లూక భూమికాం నిర్వాహయన్ ।**
**ఏకైక శ్చమత్కారాన్ కుర్వంతో యుగ పర్యాయమ్ ॥ కర్తుంతే నఫలా**
**జాతాః వృత్తిశః శుద్ధా సమస్తతః ।**
**వైశంపాయనే నైవై తత్సర్వం మాయయా వినిర్మితమ్ ॥**

**యు**గాంతానికి కారణమైన పరివర్తన గురించి ఋషిపుంగవుల ఈ చర్చ సాధారణ స్థాయికి చెందినది మాత్రం కానేకాదు. ఈ చర్చ అసాధారణమైన పురుషార్థానికి సంబంధించినది. సత్ప్రయోజనాలకై ఆదర్శవంతమైన సహకారం, ప్రయాస, దైవసహాయం వీరికి సదా లభిస్తూనే ఉంది. దీనికై జాగృతాత్మలు వానరులు, పక్షులవంటి నికృష్టమైన పాత్రలు కూడా ఒక్కొక్కసారి పోషించవలసి వస్తూ ఉంటుంది. చరిత్ర యొక్క మహా పరివర్తనలో లెక్కలేనన్ని పుటలలో జాగృతాత్మలు యేవిధంగా అనేక అవరోధాలను ఎదుర్కొన్నదీ చిన్నచిన్న పురుషార్థాలే అయినప్పటికీ సాహసం ఔదార్యంతో వారు ముందుకు ఉరికినపుడు పరిస్థితులు ఎంతగా అనుకూలించినదీ, సువర్ణాక్షరాలతో లిఖించబడి ఉన్నాయి.

సృష్టి, నాశనం - ఈ రెండూ ప్రక్క ప్రక్కనే కలిసి పయనిస్తూంటాయి. సృష్టి యొక్క శాశ్వత పరివర్తనా ప్రక్రియ అంటే ఇదే.

**శ్లో॥ ప్రయాసేఽ స్మిన్న సంఖ్యేయ దేవమానవ పౌరుషమ్ ।**
**ప్రచండమఖి జిందశ్చ త్యాగః సంతోష కారకః ॥**
**బలిదాన మభూద్యచ్చ సుకృతం నరజన్మనః ।**
**అనీతేః ప్రతిరోధే చ సంఘర్షః సహసోది తః ॥**

**మహాకాలుని** పిలుపు మేరకు **సమిష్టి చేతనత్వ వాహకులుగా** ప్రకటితమయ్యే **వ్యక్తులను ఇక్కడ మహర్షి ప్రజ్ఞాపుత్రులుగా** సంబోధించి వారియొక్క సత్సాహసాన్ని వర్ణించటం జరిగింది. ప్రజ్ఞ గురించి ఎవరైతే సందేశాలను వినియున్నారో వారంతా ఆ సందేశాల కనుగుణంగా తమ ఆలోచనలను, ఆచరణలను మార్చుకోవటం జరిగింది. ప్రజ్ఞా సందేశాలు వీరిలో మహా పరివర్తనను తీసుకొని వచ్చాయి. తమను తాము, తమ స్వజనులను కూడా త్యాగం చేసికొన్న త్యాగశీలురు పజ్ఞాపుత్రులలో ఎందరో ఉన్నారు. ఈ ఆదర్శమూర్తులు వ్యక్తిగత కోర్కెలు, ఆర్థింపులు, ఆకాంక్షలు మొ॥ వాటిన్నిటినీ వినయపూర్వకంగా తిరస్కరించి ప్రచారంలోనున్న సాంప్రదాయాలను, కట్టుబాట్లను ప్రక్కకు పెట్టి, కాలానుగుణమైన ఒక ప్రత్యేక మార్గాన్ని సాహసంతో తమకు తామే యేర్పాటు చేసికొంటారని మహర్షి స్పష్టంగా తెలియచేయటం జరిగింది. ఇటువంటి ఉత్కృష్టమైన పాత్రను పోషించగల వీరు యుగయుగాంతరాల వరకూ చరిత్రలో చిరస్థాయిగా ఉండిపోతారనటంలో యేమాత్రం

**దీపపు వెలుగు నూనెపై ఆధారపడి ఉంటుంది.**

సందేహం లేదు.

**కథ 3 : అ**రుణోదయానికి ముందే ప్రసరిస్తున్న వెలుగు రేఖలను గమనించి కోడి తెల్లవారుతోందంటూ ముందుగానే లోకాన్ని మేల్కొల్పుతుంది. కేవలం ఈ జాగరూకత వల్లనే చిన్న క్షుద్రపక్షి **'కోడి'** దాని కూత కూడా విశ్వవిఖ్యాతి నొందటం జరిగింది. ఎప్పుడో ఒకప్పుడు సృష్టించబడ్డ ప్రతీ పక్షి మేల్కొంటూనే ఉంటుంది. కాని వాటి కూతకు కోడి కూతకు ఇచ్చిన విలువ, ప్రామాణికత ఎవ్వరూ ఇవ్వరు. అలాగే సూర్యభగవానుడు రోజంతా వెలుగులు, వేడిని ఇస్తూ కంటికి ఎదురుగా కనిపిస్తూనే ఉన్నప్పటికీ, ఉదయ భానునికి మాత్రం అందరూ భక్తిశ్రద్ధలతో నమస్కరిస్తారు. శుక్ల పక్షంలో మొట్టమొదటగా చంద్ర దర్శనం కోసం ప్రజలు ఆతృత చెందుతారు జీవితంలో ఎన్ని జన్మదినాలు జరుపుకొంటున్నామంటే, జన్మించిన రోజుకి ఒక విశిష్టత ఉన్నది. ఇదే విధంగా మనకు ఎన్నో జన్మలు, ఎన్నోరకాల జీవితాలు లభిస్తూ వస్తున్నప్పటికీ **అవతార పురుషులతో సహకరించటానికి ముందుకు వచ్చి, నూతన సృష్టికి తమ సహకారాన్ని అందించిన వ్యక్తుల జీవితాలు మాత్రమే వందనీయమైనవి.** ఇటువంటి జీవితానికి ఉన్న సార్థకత యేజన్మలోను ఈ జీవితానికి రాదు.

**కథ 4 : గు**రుగోవింద్‌సింహ్ ఆహ్వానాన్ని అందుకొని ఐదుగురు వ్యక్తులు సాహసంతో దేశసౌభాగ్యానికి తమను తాము సమర్పించుకొనుటకు ముందుకు వస్తారు. ఈ ఐదుగురి త్యాగనిరత అనేక వేల సమూహాల శక్తి కంటె గొప్పదని నిర్ధారించబడింది.

సగర వంశంలో జన్మించిన **భగీరథుడు** పితృదేవతలు నరకంలో దహించబడటం చూచి, దుఃఖించి వారి పరిత్రాణార్థం గంగను గూర్చి తపస్సు చేస్తాడు. స్వార్థం కొఱకు గాక పరమార్థంకోసం ఆచరించబడిన ఈ తపస్సు కాలక్రమేణా సమస్త విఘ్నాలను, అవరోధాలను జయించి సఫలీకృతమైంది. స్వర్గంలో ఉండే **గంగ** అతని పరమార్థతత్వానికి మెచ్చి, ప్రసన్నతతో భూమి మీదకు దిగిరావటానికి కూడా అంగీకరించింది. ఈనాడు కూడా అజ్ఞానాంధకారంలో దహించుకుపోతున్న లోకాన్ని **జ్ఞానగంగతో** పునీతం చేయవలసిన అవసరం అనేక మంది భగీరథల భుజస్కంధాలపై నున్నది. అవినీతి, అజ్ఞానం, అవివేకం, అభావం, అనాచారం వంటి దావానలంలో దహింపబడే మానవుల ఉద్ధరణ అపర భగీరథులైన ప్రజ్ఞాపుత్రుల వల్ల మాత్రమే సాధ్యమవుతుంది.

**కథ 5 : పృ**థ్వీపై పెరిగిపోతున్న అవినీతి, రాక్షసత్వం వీటిని చూచి ఇంద్రుడు కోపంతో వర్షాలు కురిపించటం ఆపివేస్తాడు. దుర్మార్గులను శిక్షించే నిమిత్తం చేసిన ఈ పనివల్ల 12 సం॥లు ఏకధాటిగా వర్షాలు లేక ప్రజలు హాహాకారాలతో నీరు, తిండి లేక ఆక్రోశించసాగేరు. ఇది చూచి విజ్ఞులు సమావేశం జరిపి, దేవతలను త్యాగం ద్వారానూ, తపస్సు ద్వారాను, మాత్రమే ప్రసన్నం చేసికోగలమని నిర్ధారించి **నరమేథ యజ్ఞాన్ని** ప్రారంభిస్తారు. ప్రజలు భూమిపై ఉత్కృష్ట సాంప్రదాయాలను ఆదర్శవాదాన్ని తిరిగి ప్రారంభించి, ప్రాచీన వైభవాన్ని కోరుతున్నారనే విశ్వాసం దేవతలకు కల్గినా, ముందు ఎవరు తమను తాము యజ్ఞంలో సమర్పించుకుంటారో అనే ప్రశ్న వారిని కుతూహలంతో ఎదురు చూచేలా చేసింది. **సునహశేషుడనే** వ్యక్తి ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని భంగపరచి ఋత్విక్కుల వద్దకు వచ్చి, "అయ్యలారా! లోకకల్యాణార్థం నిర్వహిస్తున్న ఈ నరమేథ యజ్ఞంలో నన్ను నేను సర్వవిధాల సమర్పించుకొంటున్నాను" అని ప్రతిజ్ఞ చేస్తాడు. సాహసం, త్యాగంతో కూడి ఆ వాక్కులు విని, పరమేశ్వరుడు అత్యంత ప్రసన్నుడై, తన అనుగ్రహాన్నంతటినీ వర్షంలో నింపి భూమిపై కురిపించి భూమి నంతనూ సస్యశ్యామలం గావిస్తాడు.

**ఆశించడం వల్ల కాక, అర్హత సంపాదించడం వల్ల దేనినైనా పొందగలవు.**

ఈనాడు కూడా సమాజంలో సరిగ్గా అటువంటి పరిస్థితులే ఉన్నాయి. విశ్వాస రాహిత్యం అనేది ఈనాడు ఆత్మాహుతి కావాలంటోంది. ఔదార్యం, పరమార్థం రూపాలలో అవినీతికి విరుద్ధంగా పోరుసాగించి సత్ప్రవృత్తులను వృద్ధి చేయవలసిన సమయమిది.

**కథ 6 : ప్రా**చీనకాలంలో **సహస్రబాహుడనే** రాజు నిరంకుశత్వంతో జీవిస్తూ సాక్షాత్తు **జమదగ్ని** వంటి మహర్షిని హతమార్చటం జరిగింది. అతని పుత్రుడైన **పరశురాముడు** ఈ వార్త విని కృద్ధుడై, ఇది కేవలం తన యొక్క వ్యక్తిగత హానిగా భావించక, సామూహిక సమస్యగా గుర్తించి పాలకుని అవినీతిని, ప్రజల అజ్ఞానాన్ని అంతం చేయసంకల్పించి, మహాకాలుని గూర్చి కఠోర తపస్సూ ఆచరిస్తాడు. లోక కళ్యాణాన్ని కోరివచ్చిన ఈ సాధకునికి మహాకాలుడు **'పరశువు'** అనే అస్త్రాన్ని ప్రసాదించి దానితో పాపవంకిలమైన, అవినీతితో నిండిన మస్తిష్కాలను ఖండించమని ఆదేశిస్తాడు. లోకానికి హానిని కల్గించే శిరస్సులన్నిటినీ పరశురాముడు గొడ్డలితో ఖండించాడు అనే దానికి అలంకారిక ప్రయోగం యేమంటే ఆయన వారి మస్తిష్కాలలో అమూల్యాగం పరివర్తనను తెచ్చి, అవినీతిపరులను నీతి మంతులుగా మార్చాడు అని అర్థం. **'పరశువు' అంటే ప్రబల ప్రచారం, సమర్థజ్ఞాన యజ్ఞము** అని అర్థం. జనమానస పరిష్కారానికి ఇది అత్యంత ఆవశ్యకమైన ప్రక్రియ. **శిరస్సును ఖండించడమంటే ఆలోచనల్లో మార్పును తీసికొనిరావటం.** మహాకాలుడు సహకారానికి ప్రచండ ప్రతీకయైన పరశువుని, పరశురామునికి సాఫల్యాన్ని పొందమని ఆశిర్వదిస్తూ ఇస్తాడు. ఈయన యొక్క రచనాత్మక, సంఘర్షణాత్మక శక్తులు మహాకాలుడు నిర్ధారించబడిన దిశగా సాగి, లోకుల మనస్సులలో అత్యంత ప్రభావాన్ని నింపాయి.

సత్సాహసాన్ని సొంతం చేసుకోగల స్థాయి ఎప్పుడూ ఉన్నదే. క్రొత్తదేమీ కాదు. కానీ ఈ దిశలో ఆలోచించి పయనించగల భాగ్యవంతులెవరంటే ఇలాంటి అవకాశాలు చేతిలోకి చిక్కినపుడు జారవిడువకుండా అప్రమత్తంగా ఉండేవారు. మాత్రమే. ప్రస్తుతం ఎలాంటి సమయమంటే అసంఖ్యాకులైన వ్యక్తులు సత్ప్రవృత్తుల సంవర్ధనం కోసం తమ భవబంధనాలను వదులుకొని **అజ్ఞానం, అవినీతి, అభావం** – వీటి నివారణలో పూర్తిగా నిమగ్నమై త్యాగాన్ని, బలిదానాన్ని సమర్పించవలసిన పరిస్థితులు. వీటికి ప్రతిఫలంగా వీరికి **పుణ్యం, పరమార్థమేగాక శ్రేయస్సు, సౌభాగ్యం** రూపంలోను, ఈ అవతారలీలా సందోహంలో వీరు పోషిస్తున్న పాత్రకు **అగ్రదూతల** రూపంలోను, అపురూపమైన లాభాలు కల్గించి వీరిని చిరస్మరణీయులుగా నిలబెట్టగల అతిమహత్తరమైన కాలమిది.

**శ్లో॥ వ్రతినో నవనిర్మాణత్వ నిర్మాణస్య చా భవన్ ।**
**యుగదేవాంగ్రిద్రష్టు శ్రద్ధాంజలిఽ సంకల్పజాదుదుః ॥**
**పంచముఖ్యాగ్ని వేద్యాస్తే పురోఽ దుర్దేవ దక్షిణా ।**
**ఆత్మ నిర్మితయే - గృష్ణన్ సాధనా సేవయో తథా ॥**

ప్రజ్ఞాపుత్రులు ఆత్మనిర్మాణం, నవనిర్మాణాలను వ్రతంగా పూని సంకల్పాల శ్రద్ధాంజలిని యుగదేవత చరణాలవద్ద సమర్పించారు. పంచముఖాలు గల అగ్ని వేదిక వద్ద **"దేవదక్షిణను"** సమర్పిస్తూ **ఆత్మనిర్మాణానికి అత్యంత అవశ్యకమైన సాధనా, స్వాధ్యాయం, సత్సగం, సేవ, సంయమనం - ఈ ఐదింటినీ మనసా, వాచ, కర్మణ ఆచరిస్తామని దీక్షపూని** తమ తమ కుటుంబ సభ్యుల ద్వారా కూడా **పంచశీల సూత్రాలను** అభ్యాసం చేయించాలని నిర్ణయం తీసకోవటం జరిగింది.

**పరమానంద ప్రాప్తికి సోపానం పవిత్రత.**

విశ్వనిర్మాణం, యుగాంతర పరివర్తన వంటి ప్రక్రియలు ముందుగా ఆత్మక్షేత్రం నుండే అరంభమౌతాయి. **ఆత్మనిర్మాణాన్ని గావించుకోగల్గిన వ్యక్తి మాత్రమే నూతన సృష్టికి** వ్రతశీలుడు కాగల్గుతాడు. భావావేశంతోను, స్వార్థ లాభంతోను, హఠాత్తుగా ఈ రంగాలలోనికి ఉరికి, ఈ మార్గాన్ని చేపట్టినా తాత్కాలిక శ్రేయస్సును, లాభాన్ని పొందితే పొందవచ్చు. కానీ తనను తాను గానీ, లోకాన్ని గానీ ఎంతమాత్రము ఉద్ధరించలేరు. మహామానవులందరూ సంస్కరణ కార్యక్రమాలను తమతోను, తమ కుటుంబ సభ్యులతోను ఆరంభించి పరిశోధనలు జరిపి ఆ అనుభవం, ఆశక్తి, ఆ పవిత్రత ఆధారంగానే లోకోద్ధరణ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించి జీవితాలను సార్థకం చేసికోగలిగారు.

**తమలోని కుసంస్కారాలను, తన కుటుంబంలోని అవినీతి, అజ్ఞానం, అభావాలను దూరం చేసికోకుండా సమాజాన్ని ఉద్ధరించే సత్తా వ్యక్తికి ఎంతమాత్రం ఉండదు. తనలోని కుసంస్కారాలను పోగొట్టుకొనకుండా ఆత్మ నిర్మాణం అనేది వ్యక్తికి ఎంతమాత్రం సాధ్యంకాదు. ఈ సాధన లేకుండా మిగిలిన యే సాధనలు ఫలించవు. మానవుని దేవమానవునిగా మార్చే ఏకైక సాధన ఇదే.**

పవిత్రమైన అగ్నిహోత్రాన్ని ఆచరించే మానవులకు అగ్నిహోత్రం ఇస్తున్న ప్రేరణ కూడా ఇదే. యజ్ఞాగ్నిని వేదాలు **"పురహితుడనీ"** మార్గదర్శకుడనీ తెలుపటం జరిగింది. ఈ సత్యాన్ని గ్రహించిన అనేక మంది మానవులు మహామానవులు కాగల్గేరు. అగ్ని పరోక్షంగా ఇస్తున్న పంచ సందేశాలు మేమిటంటే :

1. అగ్ని మండుతూ ఉన్నంత వరకూ వేడిని, వెల్గును ఇస్తుంది. కాబట్టి అగ్నిని పూజించేవారు జీవించి ఉన్నంత వరకూ సక్రియులు, ప్రకాశవంతులుగా ఉండాలి.

2. అగ్నిలో ఏది వేసినా దానికి అగ్ని తన రూపాన్ని ప్రసాదిస్తుంది కాబట్టి, వ్యక్తి తన సంపర్కంలోనికి వచ్చిన ప్రతి వారినీ తనంతవానిగా చేసి ఉత్కృష్టమైన మార్గాన్ని చూపటానికి కృషిచేయాలి.

3. అగ్ని ఎప్పుడూ ఊర్ధ్వ ముఖంగానే వెల్గుతూ ఉంటుంది. కాబట్టి వ్యక్తికి ఎటువంటి పరిస్థితులు ఎదురైనా తన వ్యక్తిత్వాన్ని దిగజారనీయక ఉత్కృష్టంగానే ఉంచుకోవటానికి ప్రయత్నించాలి.

4. అగ్ని తనకేది సమర్పించినా తాను గ్రహించక, వెంటనే విశ్వ వాతావరణంలో సర్వత్ర వ్యాపింపచేస్తుంది. కాబట్టి **అగ్నిహోత్రం చేసేవారు ఉదారులు, పరమార్థ పరాయణులుగా** మారాలి.

5. యజ్ఞావశేషం భస్మం. జీవితం యొక్క అవశేషం కూడా భస్మమే. కాబట్టి లోభమోహాలలో వడికొట్టుకుంటూ, ఉన్న వైభవాన్ని చూచి విఱ్ఱవీగుతూ, మరణాన్ని విస్మరించి జీవించకు అని యజ్ఞావశేషం హెచ్చరిస్తోంది.

యేది చేయగల్గినా చేయలేకున్నా వ్యక్తి ఈ ఐదు సందేశాలను విస్మరించకుండా జీవిస్తూ సదా ఆచరణలో పెడుతూ ఉంటే చాలు. ఈ ఐదు సూత్రాలు అతని జీవితాన్ని మార్చివేస్తాయి.

**కథ 7 : స్వా**మి రామతీర్థునితో ఒక శిష్యుడు, "స్వామీ! లోకంలో వ్యాపించిన ఈనాటి వివత్కర పరిస్థితులను నిర్మూలించి స్వర్గీయ వాతావరణాన్ని నెలకొల్పే మార్గమేదైనా ఉన్నదా?" అని ప్రశ్నించినపుడు

**ఆకాశంలో పక్షిజాడ మిగులదు. మనసులో ఆలోచనల జాడ మిగులకూడదు.**

ఆయన గట్టిగా, స్పష్టంగా "తప్పకుండా ఉన్నది నాయనా! భూమిపై ఆచరించే యజ్ఞాలలో వ్యక్తులు దేవతలను సంతృప్తి పరచటంకోసం ధనకనక వస్తువాహనాదులను గాక, తమలోని ఈర్ష్యాద్వేషాలను, క్రోధాన్ని ఆహుతులుగా వేయగల్గినపుడు ఆ యజ్ఞఫలం భూమి మీద స్వర్గావతరణ గావిస్తుంది" అని తెలియచేస్తాడు.

**కథ 8 : సం**స్కృతిని పునరుద్ధరించి, వైదిక విలువల్ని ప్రచారం చేయటం ద్వారా **కుమారిలభట్టు "సత్ప్రవృత్తుల సంవర్ధన"** అనే **దేవదక్షిణ** గురించి ప్రచారం చేస్తాడు. అలాగే స్వామీ **వివేకానందుడు విశ్వధర్మాన్ని, మానవ ధర్మాన్ని విస్తరింప చేయటం ద్వారా** ఈ **దేవదక్షిణ** గురించియే తెలియచెప్పటం జరిగింది. ఆదిశంకరాచార్యుడు ఆధ్యాత్మ క్షేత్రంలో వ్యాపించిన మూఢాచారాలను, వివేక శూన్యమైన వదంతులను నిర్మూలించటం ద్వారాను, జాగృతి కేంద్రాలను నిర్మించటం ద్వారాను దేవదక్షిణ అనే కార్యప్రణాళికను చేపట్టడం జరిగింది. వివిధ రూపాలుగా పైకి దర్శనమిస్తున్నప్పటికీ ఈ జరిగినవన్నీ **యుగధర్మానికి తగిన దేవదక్షిణా కార్యక్రమాలే** తప్ప వేరొకటి ఎంతమాత్రం కాదు.

**మదాలస** తన నల్గురు బిడ్డలను సుయోగ్యులుగా తీర్చిదిద్ది వారిని సమాజ దేవత యొక్క పాదాలముందు ఆనందంగా సమర్పించి వేసింది. ఆ తరువాతనే వారు నల్గురు సన్యాస ధర్మాన్ని స్వీకరించటం జరిగింది.

**సంత్ జ్ఞానేశ్వర్** తండ్రి గురువయొక్క ఆజ్ఞానుసారం సన్యాస ధర్మాన్ని వదలి గృహస్థాశ్రమంలో ప్రవేశించాడు. ఈ విధంగా చేయటం వలన అతడు సమాజ నిందకు గురియైనప్పటికీ, **కుటుంబ నిర్మాణం అనే మహాక్రతువును** చేపట్టి నల్గురు పిల్లలకు జన్మనీయటం జరిగింది. ధర్మం, సంస్కృతి – వీటిని అత్యంత ఉన్నత శిఖరాలకు చేర్చటానికి ఈ నాల్గు ఉన్నత ఆత్మలు పైనుండి క్రిందకి దిగిరావటానికి ఈయన యొక్క గృహస్థాశ్రమమే ఆధారభూతమైంది. ఈ నల్గురు దేవమానవులను సమాజానికి సమర్పించి ఆయన తిరిగి ఆనందంగా తన సన్యాసాశ్రమంలో ప్రవేశించాడు.

**మనువు** సన్యాసాన్ని స్వీకరించాలని అతృత చెందే క్షణాలలో "ముందు నీవు ఉత్కృష్ఠమైన గృహస్థ ధర్మాన్ని స్వీకరించి, సుసంతానాన్ని సమాజానికి అందించి, ఆ తరువాతనే సన్యాసాన్ని స్వీకరించి, మోక్ష ప్రాప్తికై సాధన చేయమంటూ అదృశ్య జగత్తునుండి వారికి ఆదేశం లభించింది. ఇటువంటి వ్రతశీలురు నూతన సృష్టికి కావలసిన సంకల్పాలను ఔదార్యంతో, సాహసంతో చేపట్టడం వల్లనే సమాజంలో సత్ప్రవృత్తుల రూపంలో వెలుగులు వెదజల్లబడుతూ, దుష్ప్రవృత్తుల రూపంలో వ్యాపించిన అంధకారాన్ని దూరం చేయటం సంభవిస్తూ వచ్చింది.

**శ్లో॥ జాతా, ప్రఖరతా తేషాం సత్ప్రవృత్త్యుదయం వ్యధాత్ ।**
**దుష్ప్రవృత్తి క్రమో భగ్నస్థానాం శేషత్వ హేతవే ॥**
**కశ్చిన్న వసరో భూయ ఆగమిష్యతి నిశ్చితం ।**
**అగృష్టాన్ యుగస్రష్టార ఔదార్యస్యాంశ మర్పితుమ్ ॥**

ప్రజ్ఞావతారం వ్యక్తి వ్యక్తిలోను వారి వారి జీవన క్రమంలోను ఆదర్శవాదాన్ని సాధ్యమైనంత అధికంగా ధారణ చేసికోమని ఒక క్రొత్త చైతన్యాన్ని జాగృతం చేస్తోంది. ఉన్నత స్థాయికి చెందిన భావ సంవేదనలు మూర్ఛిత అంతఃకరణల్లో ఉద్భవింపజాలవు. ప్రజ్ఞావతార ప్రేరణతో ప్రజలు తమలో క్రొత్త నవజీవన

ప్రవాహకెరటాలు ఉప్పొంగుతున్నట్లు అనుభూతిని పొందుతున్నారు. వారి మస్తిష్కాలలో ఉత్కృష్టతవల్ల ఆసక్తి ఉత్పన్నమవుతోంది. **యుగ పరివర్తనకు కావలసిన నూతన సృష్టి బీజాలు ప్రాణవంతులు, ప్రతిభావంతులు అయిన జాగృతాత్మల యొక్క దేవదక్షిణ రూపంలోనే మొలకెత్త నారంభిస్తున్నాయి.**

ప్రవృత్తి **మారటం వలన సర్వం మార్పు చెందుతుంది. కానీ అంతరంగం మారనపుడు బయట మార్పులు ఎంతగా కన్పట్టినా అవి మార్పులు అనిపించుకోవు.** ఏదో ఒకనాడు మూలప్రవృత్తి బయటపడి విజృంభించక మానదు.

**కథ 9 : ఒక** అడవిలో ఒక తాంత్రికుడు భయపడుతూ తనవైపు వచ్చిన ఎలుకను చూచి అది పిల్లిని చూచి భయపడుతున్నట్లు గమనించి ఆ ఎలుక భయాన్ని పోగొట్టదలచి దానిని పిల్లిగా మార్చివేస్తాడు. ఆ పిల్లి కుక్కని చూచి భయపడటంతో దానిని తిరిగి కుక్కగా మారుస్తాడు. ఈ కుక్క దూరాన ఉన్న చిరుతను చూచి గడగడా వణకసాగింది. వెంటనే కుక్కను చిరుతపులిగా మార్చివేస్తాడు. చిరుత వేటగాడిని చూచి భయపడసాగింది. అది చూచి మాంత్రికుడు **అంతరంగం మారనంతవరకు బాహ్య రూపాలలో ఎంతటి మార్పును కల్గించినప్పటికీ సమస్యలు పరిష్కారంగావని** అర్థం చేసికొంటాడు.

అంతరంగం మారిననాడు బయటి వేషం ఏదైనప్పటికీ సత్ప్రవృత్తులయందు ఆసక్తి జనించి తాను మారటమే గాక ఇతరులను కూడా ఉన్నతులుగా చేయటానికి ప్రయత్నించగల్గుతాడు.

శ్లో॥ **సుప్రభాత మిదం ప్రజ్ఞ యుగస్యా భూన్మహామునే ।**
**జాగృతాత్మంశదానం తద్ ఋషి రక్త మివాఽ భవత్ ॥**
**సమర్థః సంస్కృతేర్నవ్యం సీతాయాః జన్మనః కృతే**
**సత్ప్రవృత్తీ రసంఖ్యేయ ఇదం సామర్థ్య మాసృజన్ ॥**

**ఓ** మహామునీ! ప్రజ్ఞాయుగ సుప్రభాతాన్ని ఆలపించే సమయం ఆసన్నమయింది. **జాగృతాత్మల అంశదానం ఋషుల రుధిరంవలె సంస్కృతి అనే అభినవ సీతకు జన్మనీయటానికి సామర్థ్యాన్ని సంపాదించింది.** ఈ సామర్థ్యమే అగణిత సత్ప్రవృత్తుల ఉద్భవానికి కారణమయ్యింది. **ఆత్మనిర్మాణం - యుగనిర్మాణం** అనే సమన్వయ ప్రక్రియే **దేవదక్షిణ** పేరుతో పృథ్వీమీద ఖ్యాతినొందినది. అగ్నిని సాక్షిగా చేసికొని వీరిచ్చే శ్రద్ధాంజలి వీరియొక్క శ్రేయ సౌభాగ్యాలకు కారణమయ్యింది. దిగజారిన మానవస్థాయి పునరుద్ధరింప చేయటానికి హేతువయ్యింది. ఈ ప్రక్రియ **యుగశక్తి** రూపాన్ని ధరించి మహా పరివర్తనకు కారణభూతమైనది. వర్తమానం యొక్క రూపురేఖలు ఈ మాత్రంగానే కనిపిస్తున్నప్పటికి ఉజ్జ్వల భవిష్యత్తు మాత్రం ఖాయం.

**జాగృతాత్మలను యుగచైతన్యం నూతన సృష్టికొరకు సమయదానాన్ని కూడా అర్థించడం జరిగింది.** భగవంతుడు అనేక పర్యాయాలు తన ప్రాణప్రియులైన భక్తులను ఎన్నెన్నో యాచించిటం జరిగింది. ఆయన తన దారిద్ర్యం వల్లగానీ, అసమర్థత వల్లగానీ, అంగవిహీనత వల్లగానీ ఎంతమాత్రం యాచించలేదు. భక్తులను ఉత్కృష్టులనుగా చేయటానికి, వారున్న స్థితినుండి దాటించి ఉత్కృష్ట స్థితికి చేర్చటానికి, వారి కర్మలను కడిగి వేయటానికి దైవం చేయిచాచి యాచిస్తూ ఉంటాడు. యాచన అనే ఈ పరీక్షా పద్ధతి లేనినాడు నిజ భక్తులకు

**నీటినుండి పాలను వేరు చేసేది హంస; దేహ ఇంద్రియ మనో బుద్ధుల నుండి ఆత్మను వేరు చేసినవాడు పరమహంస.**

నకిలీ భక్తులకు మధ్య వ్యత్యాసం తెలియబడే అవకాశమే లేదు.

**కు**చేలునకు మూటకట్టి దాచిన అటుకులు విప్పి కృష్ణునిచే తినిపించవలసి వచ్చింది. కర్ణునికి కవచకుండలాలు అర్పించవలసి వచ్చింది. శబరికి కొరికి రుచి చూచి దాచిపెట్టిన పళ్ళబుట్టను దైవం కోసం ఖాళీ చేయవలసివచ్చింది. దరిద్రుడైన విదురుని భార్యకు అతిథిగా వచ్చిన దైవానికి ఏమి తినిపించాలో అర్థంగాక, ఇల్లంతా గాలించగా దొరికిన **"బధువా ఆకుకూర"** వండి వడ్డించవలసి వచ్చింది. అనేక జాగృతాత్మలు నావికులుగాను, కోతులుగాను జన్మనెత్తి దిగివచ్చి దైవానికి తమ సామర్థ్యాన్ని, శ్రమను ధారపోయవలసి వచ్చింది. ఇలాంటి సందర్భాలలో ఉడుతలాంటి క్షుద్రప్రాణి కూడా నావల్ల యేమవుతుందిలే అని బాధ్యతను ఎగవేయటానికి ప్రయత్నించలేదు. రామకార్యంలో సహాయపడి జన్మను సార్థకం చేసికొన్నది.

గొఱ్ఱెలు తమ పాలకులకు ఉన్నిని ఇస్తాయి. వీటి జూలును కత్తిరించిన తర్వాత తిరిగి ప్రకృతి వాటికి రెట్టింపు జూలును ప్రసాదిస్తుంది. ఈ విధంగా అవి ఉన్న దానిని సమర్పించి యజమాని యొక్క ఆదరణను, స్నేహాన్ని పొందుతున్నాయి.

యుగదేవత కోరుతున్న **సమయదానం, అంశదానం** ఇచ్చేవారు కూడా ఇచ్చిన దానికనేక రెట్ల లాభాన్ని, కీర్తిని, దైవ కృపను పొందగల్గుతున్నారు.

మోహగ్రస్థుడైన అర్జునుడు క్లిష్టమైన మహాభారత యుద్ధంలో పాల్గొనటానికి నిరాకరించినపుడు చిత్ర విచిత్రాలుగా తర్కం జరిగింది. భగవంతుడు వస్తుస్థితిని గాక, వాస్తవిక స్థితిని చూడమంటూ **క్లైబ్యం మాస్మగమః పార్థా నైతత్వ వ్యుపపద్యతే । క్షుద్రం హృదయ దౌర్భల్యం త్యక్త్వోతిష్ఠ పరంతపః ।"** అంటాడు. కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాలలో వ్యక్తుల యొక్క నిర్లక్ష్యం, ఉపేక్ష గొప్ప గొప్ప అవసరాలు వచ్చినపుడు వారు చూపే లోభిత్వం, పిరికితనం వల్ల జీవితంలో వారు ఎంతగా నష్టపోతారో రవీంద్రనాథ్ ఠాగూర్ ఒక కావ్యకథలో తెలియజేశారు.

**కథ 10 : "**వీథులన్నీ తిరిగి యాచించుకొన్న గోధుమలతో ఒడి నింపుకొని ఇంటికి తిరిగి వస్తూండగా ఒక వృద్ధుడు చేయిజాచి ఆ గోధుమలను దానం చేయమని అడిగాడు. నేను కష్టపడి సంపాదించిన సొమ్ము ఇతనికి ఎందుకీయవలెనని భావించి, కాదనలేక నాలుగు గింజలు మాత్రం అతని ఒడిలో దులిపి మిగిలినవన్నీ మూట కట్టుకొని వెళ్ళిపోయాను. ఇంటికిపోయి మూట విప్పి చూడగా వాటిలో కేవలం నాల్గు గింజలు మాత్రమే బంగారమై ధగధగా మెరుస్తున్నాయి. నా లోభిత్వాన్ని తృప్తితీరా తిట్టుకొన్నాను. ఎందుకంటే ఇతరుల ఔదార్యం ద్వారా లభించిన సొమ్ముపట్ల కూడా నేను ఔదార్యాన్ని చూపలేకపోయాను" అంటూ భావగర్భితమైన కవిత రవీంద్రనాథ్ లేఖిని ద్వారా లిఖించబడింది. **భగవంతుడు ఔదార్యంతో ప్రసాదించిన సంపదను పరమార్థం కోసం ఉపయోగించినట్లయితే ఆ సంపద వృద్ధి చెందుతుందని** ఈ కావ్యకథ మనకు తెలియచేస్తోంది.

**దేవదక్షిణ అంటే వ్యక్తి తన సహజ ప్రవృత్తులను దారిమళ్ళించి దైవీ ప్రవృత్తులతో కలపటం అన్నమాట.**

**గింజ పట్టిన కంకి వంగుతుంది. జ్ఞాని నమ్రత కలిగి ఉంటాడు.**

వామనమూర్తి ద్వారా జరిగిన పరీక్షానంతరం అంటే బలి స్వేచ్ఛగా ఔదార్యాన్ని ప్రదర్శించటం వలన **"సేకరించటం - అనుభవించటం"** అనే పశు ప్రవృత్తి నుండి ఆనాటి సమాజానికంతకూ విముక్తి లభించింది. వామనమూర్తికి సమర్పించివేయటం వలన బలిచక్రవర్తికి రాజ్యం పోతే పోయి ఉండవచ్చుగాక, కానీ అతనికి లభించిన సౌభాగ్యం ముందు, రాజ్యం యొక్క విలువ అతి స్వల్పమైంది. అలాగే సత్యవాదియైన హరిశ్చంద్రుడు విశ్వామిత్రునికి కేవలం తన రాజ్యాన్ని, సింహాసనాన్ని మాత్రం సమర్పించి అతి ఉత్కృష్టమైన కీర్తిని, పరమానందాన్ని పొందగల్గేడు.

**శ్లో॥ యత్రార్జున ఇవాస్త్వేవ కర్మవీర స్తథాచనః ।**
**సూత్ర సంచాలకోఽ ప్యత్ర భగవానివ భాసతే ॥**
**తత్రా సాఫల్య హేతుర్న కశ్చిదస్తి మనాగపి ।**
**ప్రసంగేఽ స్మిన్ మహాలాభస్తైర్నరైః ప్రాప్యతే భృశమ్ ॥**
**భగవతః సహగా యేతు భూత్వా తేషాం సుమంగళే ।**
**యుగపర్యయ విధేయుకాస్తు భావకా నిరంతరమ్ ॥**

**అ**ర్జునుని వంటి కర్మవీరుడు శ్రీకృష్ణుని వంటి సూత్ర సంచాలకుడు ఉన్నచోట ఎంత కష్టతరమైనదైనా సరే సిద్ధించకపోవటమంటూ ఉండదు. అవతార ప్రయోజనం, సూత్ర సంచాలనం ఈ రెండూ ఉన్న దగ్గర ఎలాంటి అసమంజసం, అవరోధం ఉండటానికి వీలులేదు. కాబట్టి ఈ విధమైన ఆలోచనలు, సందేహాలు మనస్సులోనికి రానీయకండి. భగవంతుడైన **మహాకాలునికి ఎవరు ఎంత సహకారాన్ని అందిస్తారో, అలాగే నూతన సృష్టికార్యక్రమంలో ఎవరు ఎంత ఔదార్యం, సాహసం చూపిస్తారో అంతగానూ వారు యుగపరివర్తనా కార్యప్రణాళికలో భాగస్వాములై తమ మహత్వ పూర్ణమైన పాత్రపోషణ ద్వారా జీవితాలను చరితార్థం చేసికోగలరు.** వాస్తవానికి ఉన్నతమైనవన్నీ అగ్ని వంటివి. ఈ సూత్ర సంచాలకుడు కూడా అగ్ని వంటి వాడే. ఆ అగ్ని సంపర్కంలోకి ఎవరైతే వస్తారో వారందరూ అగ్నిగా మారి తేజోవంతులు కాక తప్పదు.

పృథ్వియొక్క వైభవమంతా సూర్యుని అనుగ్రహం ద్వారా లభించినదే. ఒక వేళ సూర్యుని ఉష్ణోగ్రత 30° తగ్గినట్లయితే భూమి మొత్తం 40 అడుగులు మంచుతో కప్పివేయబడే పరిస్థితి ఏర్పడుతుంది. అలాగే సూర్యుని ఉష్ణోగ్రత 30° పెరిగిందనుకొందాము. ఇక్కడ గూడా బుధగ్రహంలో ఉండే ఉష్ణోగ్రత వలె భయంకరమైన వేడి ఉద్భవించి, వృక్షాలు, వనస్పతులు, జీవధారులు - ఒకటేమిటి సమస్తం మాడి మసియైపోతాయి. కాబట్టి ఇదంతా పైకి భూమి యొక్క సౌభాగ్యంగా కన్పిస్తున్నప్పటికీ, భూమి ఒక ఉత్కృష్టమైన స్నేహ సూత్రం ద్వారా సూర్యునితో బంధించబడి ఉండటం వలననే ఇచ్చిపుచ్చుకోవటమనే అత్యంత అవశ్యకమైన ప్రణాళిక కొనసాగుతూ ఉన్నది. జలచరాలు నీటి సహకారం లేకుండా వాటి శక్తియుక్తుల వల్లనే ఎలా జీవించగలవు? ఎంత సామర్థ్యం కల్గి ఉన్నప్పటికీ నీటియొక్క సహకారాన్ని ఉపేక్షించి, తమ కాళ్ళపై తాము నిలబడి జీవింపజాలవు. అత్యంత శక్తివంతులమని విఱ్ఱవీగుతున్న జలచరాలవంటి మానవులకు దైవ సహాయం నీరు లాంటిదని గుర్తించాలి.

ఔన్నత్యంతో సంపర్కం పెట్టుకోవటం, ఆ ఔన్నత్యం యొక్క సహకారాన్ని పొందటానికి తగిన

**నిద్ర తాత్కాలిక మృత్యువు. మృత్యువు దీర్ఘనిద్ర.**

సౌభాగ్యాన్ని కల్గి ఉండటం అనేక సార్లు ఆశించని అదృష్టంగా మన ఎట్టెదుట సాక్షాత్కరిస్తూ ఉంటుంది. అలాగని ఇలాంటి అదృష్టం, అవకాశం అందరికి అన్నివేళలా లభించాలని లేదు. జన్మజన్మల సుకృతం వల్ల ఇటువంటి అవకాశం కొంతమందికి దక్కుతూ ఉంటుంది. రాముని చరిత్రతో ముడిపడి ఉండటంవల్ల అనాడు సాధారణ స్థాయికి చెందిన అనేక ప్రాణులు తమ తమ సహజ క్రియా కలాపాల ద్వారానే అసాధారణమైన శ్రేయస్సును పొందటం సంభవించింది. ఈ సత్యాన్ని మనమంతా చాలా సులువుగా అవగతం చేసుకోగలము.

కోతులు సహజంగా చెట్లపై గెంతుతూ, గోలచేస్తూ తిరిగే ప్రాణులు. వాటి సామర్థ్యం కూడా అంతంత మాత్రము. వారధికట్టడంలో అవి చేసిన కృషి వాటి స్థాయికి తగినట్లే ఉంటుందిగాని, ఏదో గొప్పగా ఉంటుందనటానికి వీలులేదు. కానీ ఆ మాత్రం ఔదార్యం, శ్రమశీలతయే చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడి ఉన్నాయి. పురాణాలలో, ప్రవచనాలలో ఈ కోతుల త్యాగనిరతి గురించి భావపూరితమైన చర్చలు జరుగుతూ ఉంటాయి. కాబట్టి ఇలాంటి ఆదర్శవంతమైన సహకారాలు సఫలీకృతమైన సందర్భాలలో కేవలం **కర్తయొక్క కర్తృత్వం గాక దైవీ అనుగ్రహం అపారంగా లభిస్తుందని** మనకు అర్థమవుతోంది. నలుడు, నీలుడు, రాళ్ళను నీటిలో వేస్తే మునిగిపోకుండా తేలి ప్రవహించినట్లు పేర్కొనబడిన సంఘటనలు సాధారణంగా అందరకూ అన్ని వేళలా సాధ్యమయ్యేదిగాదు. అసాధాణమైన ఇటువంటివి దైవీ ప్రయోజనాలలో దైవ కృపవల్ల మాత్రమే అరుదుగా లభిస్తూ ఉంటాయి.

ఇలాగే కృష్ణ చరిత్రలోకూడా గోపికలు, గోపబాలుర విషయంలో అనేకమైన సాధారణ అసాధారణ సంఘటనలు మనకు లభిస్తాయి. వీటిని పురాణాలు కూడా ఎంతగానో కొనియాడుతూ పదేపదే ప్రస్తావించటం జరిగింది. వీరిలో అనేకమంది యోధులు పోరుసల్పి గెలవటం – ఓడటం వంటి సంఘటనలుకూడా అనేకం ఉన్నప్పటికీ అర్జునుడు, భీమసేనుడు వంటి వారికి లభించిన కీర్తిమాత్రం అసాధారణమైనది. వీరుకూడా వనవాసకాలంలో కడుపు నింపుకోవటానికి, తలదాచుకోవడానికి అనేక వేషాలు వేసి అవస్థలు పడినవారే. ముఖ్యంగా ద్రౌపదిని వివస్త్రను చేసేటప్పుడు చూస్తూ ఊరుకొన్న పాండవులే నిజంగా మహాభారత యుద్ధంలో అంతటి ఘన విజయాన్ని సాధించగల సర్వ సమర్థులైననాడు దుర్యోధనుడు, దుశ్శాసనుడు అంతటి దౌర్జన్యాన్ని చూపటానికి సాహసించి ఉండేవారు కాదు. అలాగే పాండవులు ఆ దౌర్జన్యాన్ని సహించి పడిఉండేవారుగాదు. మహభారత యుద్ధంలో పాండవులకు అంతటి ఘన విజయాన్ని సంపాదించి పెట్టిన ఏకైక ఆధారం, వీరు కృష్ణపరమాత్మను తమవాడుగా భావించి ఆయనకు తమను తాము పూర్తిగా సమర్పించుకోవటమే. ఈ వివేక పూరితమైన ఆలోచనే పాండవులను అంతటి ఉత్కృష్ఠులుగా చేసి, భగవంతుడంతటి వానిని తాము ఎక్కిన రథాన్ని తోలించటానికి వివశుణ్ణి చేసింది.

**బుద్ధభగవాను**ని పాదాల ముందు తమ జీవితాలను సమర్పించుకోవటానికి సాహసించని పక్షంలో **అశోకుడు, హర్షవర్ధనుడు, ఆనందుడు, రాహులుడు, సంఘమిత్ర, అంబాపాలి** వీరందరి జీవితాలు సర్వ సాధారణంగా లెక్క లేనట్లు సాగియుండేవి. ఇంతటి శ్రేయస్సు వీరికి దక్కిఉండేది గాదు.

**వినోభా, రాజగోపాలాచారి, నెహ్రూ, పటేల్**–వీరంగా కలసి ఉండక విడివిడిగా కొనసాగిననాడు

**అహంకారం అజ్ఞానానికి అనుంగుబిడ్డ.**

ఈనాడు ఏ పరిస్థితులు అయితే ఉన్నాయో అవి ఎంత మాత్రం ఇలా ఉండక మరింత అధ్వాన్నంగానూ, భయంకరంగానూ ఉండేవి.

**చాణుక్యునితో చంద్రగుప్తుని** అనుబంధము, **సమర్ధగురు రామదాసుతో శివాజీ** అనుబంధం; **పరమహంసతో - వివేకానందుని** అనుబంధము ఇరు పక్షాలకూ ఎంత అవశ్యకమైనదో అందరకూ తెలుసు.

**శ్లో॥ దినం నహి సుదూరం తత్ యత్రకాల విపర్యయః ।**
**చింతనం స్యాచ్చరిత్రం చ నరాణాం పరివర్తితమ్ ॥**
**ఉత్కృష్ఠతా నుసంస్కారైః సంస్కృతాస్తే నరాధృవమ్ ।**
**విముఖాశ్చ ర్నికృష్టత్వాత్ స్వార్ధ సంకీర్ణ తాగ్లపేత్ ॥**

ప్రజ్ఞాయుగం యొక్క భావి స్వరూపాన్ని గూర్చి త్రికాలజ్ఞుడైన మహర్షి పూర్వ కథనాన్ని వ్యక్తం చేస్తూ ప్రజ్ఞాయుగం అత్యంత శ్రేష్ఠమైనది, ఆదర్శమైనది అని వక్కాణించటం జరిగింది.

ప్రజ్ఞాయుగంలో మానవుల ఆలోచనలు, ఆచరణలు, శీలము ఎంతగానో మార్పు చెందుతాయి. ప్రజలు తమ నికృష్ఠ మార్గాలను సునాయాసంగా త్రోసిపుచ్చి ఉత్కృష్ఠ మార్గంలోనికి సాహసంతో ఉరుకుతారు. ఈనాడున్న సంకీర్ణ స్వార్ధపరత్వం ఆనాడు వెదకినా కనిపించదు. చూస్తూ ఉండగా వ్యక్తులలో సత్రవృత్తులు ఆకాశమంత ఎత్తుకు ఎదగ నారంభిస్తాయి. ఔదార్యం, సహకారం నలుదిక్కులా వ్యాపించటం వలన ఎటుచూచినా ఉల్లాసం, ఆనందం తాండవిస్తాయి. అపరాధాలు, నేర ప్రవృత్తులు మచ్చుకైనా కానరావు. స్వల్పమైన సాధన సామాగ్రులతో ప్రజలు తృప్తిగా నిండుగా జీవిస్తారు. ఎటుచూచినా హద్దులేని సుఖశాంతులు వెల్లివిరియటంలో స్వర్గీయ వాతావరణం నెలకొంటుంది. ఏకత్వమే తప్ప భిన్నత్వానికి తావుండదు. ఒకే రాష్ట్రం, ఒకే భాష, ఒకే ధర్మం నీడలలో వ్యక్తులంతా జీవిస్తారు. విశ్వ ధర్మాన్ని, మానవ సంస్కృతిని అందరూ ప్రేమ పూర్వకంగా స్వీకరిస్తారు. మానవులు మానవుల వలె గాక దేవతలవలె దృష్టిగోచరమవుతారు. **ఈ ప్రజ్ఞాయుగం గడచిన కాలంలోని సత్యయుగం కంటే కూడా శ్రేష్ఠమై ఉంటుంది.**

ఈనాటి భీతావహ పరిస్థితులను రూపుమాపవలసిన వినాశకరమైన కాలము ఇది కానేకాదని, నవ నిర్మాణానికి ఈ కాలం అన్ని విధాల అనువైనదని అనేక మంది భవిష్యత్‌వేత్తలు, కాలజ్ఞానం తెలిసిన వారు, అతీంద్రియ శక్తులు గల్గినవారు ప్రకటించటం జరిగింది. ఇది కేవలం ఈనాడు సాగుతున్న క్రొత్త ప్రసావన ఎంత మాత్రమే గాదు. తరతరాలుగా సాగుతున్న పాతప్రస్థావనే. వేల సంవత్సరాలుగా విశ్వమంతా వ్యాపించిన కళంకితమైన కారుచీకట్లను కడగివేసి, మానవత్వం యొక్క ప్రాచీన ఉజ్జ్వల గౌరవాన్ని పునః స్థాపన గావించటానికి ఆసన్నమైన పుణ్యకాలమిది. ఇప్పుడున్న వారందరూ పుణ్యమూర్తులే అని మహర్షి పేర్కొనడం జరిగింది.

**కథ 18 :** శిధిల సమాజ వ్యవస్థకు కాలానుగుణంగా మరమ్మత్తులు జరుగుతూనే ఉన్నాయి. అలాగే సంస్కర్తల వలస కూడా సాగుతూ ఉన్నదే. మార్గదర్శకులు, దేవదూతలు, ఋషులు, మునులు ఉద్భవిస్తూ కాలానుగుణంగా అవసరాలకు తగినట్లు పరిస్థితులను చక్కబరచి, నూతనసృష్టికి తమ వంతు బాధ్యతని తమతమ పద్ధతుల ద్వారా నిర్వర్తిస్తున్నారు.

**అ**హంకారి, స్వార్థపరుడు, విలాసాలకు అధిపతియైన రావణునితో పోరాడటానికి సాక్షాత్తు భగవంతుడు రాముని రూపాన్ని ధరించి దిగివచ్చాడు. సీతారాముల కల్యాణం గృహస్థ భోగాలను అనుభవించటానికి కాక అసంపూర్ణమైన దాన్ని పూర్ణంగా మార్చి, కాలం యొక్క అవసరాన్ని తీర్చటం కోసం జరుపబడినది. వనవాసంలో నున్న సీత అపహరించబడి లంకకు చేర్చబడింది. సీతాపహరణం జరగనినాడు అవినీతి పరుడైన రావణుడు సంహరించబడే వాడుకాడు. ప్రతీ అవతార మూర్తి **జన సహకారా**న్ని సమీకరించుకొని జాగృతాత్మల యొక్క జీవితాలు విశ్రాంతిగా, సుఖంగా జీవించటానికి ప్రసాదింపబడినవి గావని, అధర్మాన్ని నశింపచేసి, ధర్మాన్ని రక్షించటానికి మాత్రమే ప్రసాదించబడ్డాయని అడుగడుగునా గుర్తు చేస్తూనే ఉంటాడు. రాముడు కూడా వానర సహాయంతో రావణుని దౌర్జన్యాన్ని (ఆతంకవాదాన్ని) అంతంచేసి, స్వర్ణమయమైన లంక సర్వనాశనమైన తర్వాత రామరాజ్యాన్ని స్థాపిస్తాడు. ఆ విధంగా క్రొత్త యుగం ఆరంభమై స్వర్గీయ వాతావరణం నెలకొల్పబడింది.

భగవానుడైన శ్రీకృష్ణుడు రాజ్యభ్రష్టులను గావించిన పాండవుల ద్వారా దురాచారులైన కౌరవులను నశింపచేసి నీతి, న్యాయం, ఆదర్శంతో నిండిన రాజ్యస్థాపన గావించాడు. అలాగే బుద్ధభగవానుడు కూడా ధర్మం పేరిట వ్యాపించిన అవినీతి, అత్యాచారాలు, మూఢనమ్మకాలను ఎదుర్కొని వివేకం, సత్యం, అహింసతో కూడిన పాఠాలను పఠింపజేశాడు. నర సంహారం చేసే అశోకుని వంటి చక్రవర్తిని కూడా తన పాదాక్రాంతుణ్ణి చేసికొని, కేవలం భారతభూమిలోనే గాక విశ్వమంతటా బౌద్ధధర్మాన్ని ప్రచారం చేసి శీలవంతమైన రాజ్యాన్ని స్థాపించాడు.

రాబోయే కాలంలో ఏమవుతుంది? అనే విషయంమీద విశ్వంలోని భవిష్యత్ వేత్తలు, అనేకమంది కాలజ్ఞానం తెలిసిన వారియొక్క ఏకాభిప్రాయం యేమిటంటే : (1) 1990 నుండి 2000 సంవత్సరాల మధ్యకాలం అత్యంత కష్టతరమైన గడ్డుకాలమై ఉంటుంది. (2) ఈ కాలంలో ఉజ్జ్వల భవితవ్యానికి కావలసిన రచనాత్మక ప్రవృత్తులు దశదిశలా వృద్ధి చెందుతాయి. వర్తమాన పరిస్థితులను మార్చగల పరాక్రమవంతులైన మహామానవులు అనేకమంది వెలుగులోనికి వస్తారు. (3) ఈ వ్యవధిలోనే కేవలం భారతదేశం అతి ఉత్కృష్టమైన పాత్రను పోషిస్తుంది. పవిత్ర భారతభూమి తన ఆధ్యాత్మిక పునరుద్ధరణ నవనిర్మాణ కార్యక్రమంలో గాఢంగా లీనమై పూర్తి సాఫల్యాన్ని సాధిస్తుంది. ఈ మూడు అసాధారణ స్థితులు ఏవిధంగా సఫలీకృతం కాగలవో ఈ తరానికి చెందిన ప్రజలు తమ చర్మచక్షువులతో స్వయంగా చూస్తారు. భవిష్యత్ వక్తలకు, దివ్యదృష్టి కలవారికి నేటి విపత్కర పరిస్థితులు, విశ్వవినాశనం పట్ల ఎంతటి గాఢవిశ్వాసం ఉన్నదో అంతకంటే అనేకరెట్లు ఎక్కువ విశ్వాసం వీరికి **ఉజ్జ్వల భవిష్యత్తు** పట్ల; దీనిలో భారతదేశం యొక్క ఉత్కృష్టమైన పాత్రపోషణ పట్ల కూడా ఖచ్చితంగా ఉన్నది.

వివిధ కాలాల్లో, వివిధ సమయాల్లో తత్త్వవేత్తలు, ద్రష్టలు వ్యక్తం చేసిన అభిప్రాయాలు సంక్షిప్తంగా యేమిటంటే : ఈనాటి పరిస్థితి ముందుముందు ఇంక కొనసాగదు. చాలా మార్పులు వస్తాయి. భావి సమాజపు స్వరూప స్వభావాలు ఈనాడు ఉన్నదానికి పూర్తిగా భిన్నంగా ఉంటాయి. క్రొత్త మానవత్వపు సభ్యసమాజం ఏర్పడబోతున్నది. రాబోయే 20 సంవత్సరాలలో మానవ జాతియొక్క భాగ్యాన్ని ఎవ్వరూ మార్చనక్కర్లేకుండా దానంతట అదే చక్కబడుతుంది. ఈనాడు ధనార్జన, సంగ్రహం, సుఖభోగం కొనసాగినట్లయితే రాబోయే కాలంలో కూడా శాంతి కరువై ఘర్షణలే చెలరేగుతూ ఉంటాయి. కాబట్టి వినాశనాన్ని అరికట్టాలంటే డబ్బుపట్ల వ్యక్తి దృష్టికోణం, పాలకుల యొక్క నిర్ధారణలు ఆదినుండి అంతం

**మనల్ని బంధించేవి వస్తువులూ, వ్యక్తులూ కాక - వాటిపై మనకున్న భ్రాంతి.**

వరకూ మారవలసి ఉన్నది. పరివర్తన యొక్క భావినిర్ధారణలు విశ్వకుటుంబంపై ఆధారపడి ఉంటాయి. దానియొక్క తత్వదర్శనం, వ్యవహార వక్షం కూడా భారత భూమియొక్క పురాతన సంస్కృతిని వెదకి బయటకు తీయటమే అయి ఉంటుంది. **ఈనాడున్న విపత్తుల నుండి బయట పడగల్గిన మానవజాతి కేవలం ఆధ్యాత్మ తత్వజ్ఞానాన్ని స్వీకరించగల్గినవారు మాత్రమేనని మహనీయులందరూ ఏక కంఠంతో ఘోషిస్తున్నారు.**

పైన పేర్కొన్న ప్రతిపాదనలు మూర్ధన్యులైన ఆలోచనాపరులు అదృశ్య జగత్తుతో సంబంధం గల ఋషుల వంటి దివ్యాత్మల ఆంతరంగంలోని చేతనత్వాన్ని కేవలం దైవీ ప్రణాళిక ద్వారా మాత్రమే తెతుసుకొన్నట్లు స్పష్టమవుతోంది. అవతారమూర్తి దిగివచ్చి, అవసరంలేని వాటిని రూపుమాపి ఆ స్థానంలో నీతిని, నిష్ఠను ప్రతిష్టించి యుగాన్నీ మార్చే పరిస్థితులకు అవసరమైన అనేక కారణాలు ఈనాడు సర్వత్ర నిండియున్నట్లు వీరు స్పష్టంగా దర్శనం చేయటం జరిగింది. మాన్సూన్ (Mansoon) ప్రవేశించగానే అతి త్వరలో వర్షం కురుస్తుందని వివేక వంతులందరూ ఎంత సులువుగా చెప్పగల్గుతున్నారో అంత సులువుగానే యుగపరివర్తన జరగనునునట్లు మూర్ధన్యులు, దివ్యాత్మలుగూడా గుర్తించటం జరిగింది.

ఈనాటి అవాంఛనీయ పరిస్థితుల కారణంగా ఉత్పన్నమైన అసంతులనం వల్ల అంతరిక్షమంతటా విక్షోభం వ్యాపించి యున్నది. యుగచైతన్యం తుఫానువంటి పరివర్తనను వెంటబెట్టుకొని వస్తుండగా రెండవవైపు అంధకారాన్ని సవాల్ చేస్తూ ప్రభాతం ఉషోదయంలోనే తన రాక ఖాయమంటూ తెలియజేస్తోంది.

**శ్లో॥ వైశంపాయన సంవాదః విష్ణునారద యోస్తుయః**
**తతః ప్రజ్ఞాపురాణస్య విస్తరస్య తథైవ చ ॥**
**ప్రజ్ఞాభియాన కస్యాపి విశ్వగో విస్తరస్తు యః ।**
**పరిచయస్థస్య సంక్షిప్తో బోధితోయం మయాఽ ధ్వునా ॥**

**ఓ** వైశంపాయనుడా! విష్ణునారద సంవాదం నుండి ప్రజ్ఞాపురాణం యొక్క ప్రాశస్త్యాన్ని, అవశ్యకతను తెలియజేస్తూ ప్రజ్ఞాభియాన్ యొక్క విస్తరణ వరకూ సంక్షిప్తంగా పరిచయం చేశాను. ఓ మహాత్ముడా ! దివ్య దృష్టితో భవిష్యత్తు యొక్క స్వరూపాన్ని గూడా స్పష్టంగా చూడగల్గుతున్నాము. మిగిలిన అవతారాల కంటే ప్రజ్ఞావతారలీల అత్యంత మహత్వ పూర్ణమైనది. ఎందుకంటే ఎక్కడైతే భయంకర విపత్తులను నిర్వీర్యం చేయటం జరిగిందో సరిగ్గా అదే స్థానంలో స్వర్గాన్ని క్రిందకు దింపటం అనేది అత్యంత ఆశ్చర్యకరమైన విషయం. కాబట్టి **ప్రజ్ఞాయుగం అతి శ్రేష్ఠమైన యుగంగా** అంగీకరించక తప్పదు. ఈ యుగాన్ని భూమిమీదకు దింపే **ప్రజ్ఞాపుత్రులు** ఎంతటి ధన్యులో ప్రత్యేకంగా వివరించ నవసరంలేదు. రాబోయే కాలంలో వీరిగురించి కథలుగా చెప్పబడుతున్నప్పుడు వినేవారంతా, 'అయ్యో! ఆ కాలంలో నేను లేకపోయానే, ఉండివుంటే ఎంత బాగుండేది' అని చింతించక మానరు.

సూర్యోదయానికి ముందు అధికంగా అంధకారం అలుముకొంటుంది. ఐనా అది ప్రభాత కిరణాలు సోకినంతనే పూర్తిగా మాయమవుతుంది. వెంటనే పక్షుల కలకలారావాలు దశదిశలా వ్యాపిస్తాయి. అంధకారం వంటి వినాశనం జరుగకుండా ప్రభాతం వంటి నూతన సృష్టి ఎలా సాధ్యం? **ఇది ఒక చారిత్రాత్మక ప్రసంగం ఎంత మాత్రం కాదు. ప్రతీ ఆత్మవాది తప్పనిసరిగా స్వీకరించ వలసిన ఈశ్వరీయ మార్గదర్శనం.** ఈ కలియుగ మహాభారత యుద్ధంలో మోహాగ్రస్తులై వెనుకబడిన వారంతా కాలం చేతినుండి జారిన తర్వాత

పశ్చాత్తాపంతో కుమిలిపోక తప్పదు. ఇంత విలువైన కాలం అతి సమీపంలో ఉండి కూడా ఎందుకు ఉపయోగించుకోలేక పోయామా! అని దుఃఖిస్తారు.

ఈ విచిత్రమైన లీలాసందోహం ప్రతీ అవతారం వెంట ఉన్నదే అయినా, అవతార మూర్తులు దగ్గర ఉన్న కాలంలో వారిని ఎవ్వరూ గుర్తించలేరు. అవతార మూర్తులు సృష్టి కార్యక్రమాలను ప్రజ్ఞాచక్షువులతో మాత్రమే దర్శించగలరు. చర్మచక్షువుల వలన దర్శించటం సాధ్యం కాదు. నివేదిత వివేకానందుణ్ణి గుర్తించింది. నెహ్రూ, పటేల్ గాంధీజీని గుర్తించారు. అశోకుడు, హర్షవర్ధనుడు బుద్ధునియొక్క ఆలోచనా కాంతిని గుర్తించారు. గుర్తించిన వెంటనే వీరంతా వారికి పూర్తి సహకారాన్ని అందజేశారు. అవతార మూర్తులు రావటం, నిష్క్రమించటం జరిగేక వారిని గుర్తించిన వాళ్లు, వారు దగ్గరేయున్నా గుర్తించలేని వాళ్ళూ అసంఖ్యాకులు ఉన్నారు. కానీ వీరు వీరి జీవితాలను ధన్యం గావించు కోలేకపోయారు.

ఈనాడు మహాకాలుడు స్వయంగా గొంతెత్తి ప్రాణవంతులను **మీ సహకారాన్ని అందించండని** అంటూ ఆహ్వానిస్తున్నాడు. నిజానికి ఇది మీకిస్తున్న శుభ సందేశమని చెప్పక తప్పదు. దివ్య శక్తులు తమ అదృశ్య శక్తుల ఆధారంగా వారి పని వారు స్వయంగా చేసికొనగలరు. వానరులు అలగి ముడుచుకొని కూర్చొన్నా సీత తిరిగి రావటం, లంక, రావణుడు సర్వనాశనం కావటం జరిగితీరుతుంది. కానీ ఇలాంటి అవకాశాలు జాగృతాత్మలు చేయిదాటనీయరు. యుగసంధి యొక్క నేటి ప్రభాతలీల కూడా సరిగ్గా ఇలాంటి సుముహూర్తమేనని గ్రహించండి. సాహసులు, సహృదయులు చిన్నగానే ముందడుగు వేసినప్పటికీ అధిక శ్రేయస్సును పొంది గొప్పవారిలోనే లెక్కించబడతారు.

**మార్కండేయముని ఇలా అన్నారు :**

**శ్లో॥ తావతీతాత శ్రోతవ్యా కథాయస్యాం తు చింతనవ ।**
**మననం సంభవేచ్చాపి సమాప్తవ్యః ప్రసంగకః ॥**
**సంధ్యావందన హేతోశ్చ గచ్ఛయో వయమద్యతు ।**
**భవిష్యత్యవసర స్య జ్ఞాన చర్చా భవిష్యతి ॥**

**మార్కండేయుడు** వైశంపాయునినితో, "ఓ పూజ్యుడా! జ్ఞానాన్ని మననం, చింతనం ద్వారానే గుర్తించగల్గుతాం. జ్ఞానప్రకాశం రక్తంలోని అణువణువునా కలసి ప్రవహించేటపుడు మాత్రమే వ్యక్తియొక్క వాక్కులోను, ముఖంలోను ప్రతిబింబిస్తుంది. దేనినైనా సరిగ్గా ఆత్మగతం చేసికొవాలంటే పూర్తిగా మధించి తీరవలసిందే" అంటూ ఈ **యుగాంతర చేతన లీలాసందోహ ప్రకరణం** యొక్క సారాంశాన్ని వైశంపాయనునికి వినిపించి భవిష్యత్‌లోని పరివర్తనా ప్రక్రియల గురించి గంభీర చర్చ జరిపి ప్రసంగాన్ని ముగించటం జరిగింది.

**ఇతి శ్రీమత్ ప్రజ్ఞాపురాణే శ్రీ మార్కండేయ వైశంపాయన ఋషి సంవాదే**
**యుగాంతరీయ చేతనా, లీ**



**కరణోనామ సప్తమోధ్యాయః**